# అంకితము.

ఇంపైన గీతికలను నాకొసంగి, నా జీవితము నింతవరకు రూపొందించి, నన్ను కృతార్థుని జేసిన,

శ్రీ కనకదుర్గా దేవికిని,

శ్రీ లక్ష్మీనృసింహస్వామివారికిని,

ఈ పొత్తమును భక్తిపురస్సరముగ అంకితమొనర్చుచున్నాను.

ఓమ్ ! తత్ ! సత్ !

గుమ్మడిదల వెంకట సుబ్బారావు.



శ్రీ ర స్తు.

# ప్ర స్తా వ న.

ఈ పొత్తములో దైవికముగ నాకు లభించిన కొన్ని పద్దెములు, పాటలు, ప్రచురించుచున్నాను. "దైవిక" మనగా, నాలో యెట్టి అభ్యాసంగాని, సాధన సంపత్తికాని, కోరికగాని, ప్రయత్నముగాని లేకయే లభించినవని యర్థము. ఇందు కొన్ని గీతికలు యథార్థముగ నాకు సుషుప్త్యవస్థలో తలగడలోనుండి దొర్లి వచ్చినవి. అట్లు లభించుట చేతను, "ఆకాశము" శబ్దమున కాధారభూత మగుట చేతను, వీనికి "ఆకాశ వాణి" యని పేరిడుట తటస్థించెను.

చిన్నప్పటినుండియు నాకు తెనుగులో అభ్యాసము తక్కువ. అందు కవిత్వ మసలే తెలియదు. 'సులక్షణసారము' నేను చదువలేదు. లఘువననేమో, గురువననేమో, యిప్పటికిని నే నెఱుగను. యతిప్రాసలు నా కపరిచితములు. కవిత్వము మాయింట యిలవేల్పు కాదు. నా జీవిత మింతవరకు రాజకీయములు నూరుపాళ్లు- సారస్వతము సున్నా పాళ్ళుగ నడచినది. అట్టివానికి కవిత్వమేల? ఇచ్చటనే యున్నదొక విడ్డూరము!

అవి 1932-33 రోజులు- నేను బ్యాంకీ ఉద్యోగము మానుకొని తిరిగి రాజకీయములలో ప్రవేశింపనున్న కాలము, దేశములో శ్రీ గాంధీమహాత్ముడు బ్రిటిష్ ప్రభుత్వముతో పోరి, వోడి, తన నాయకత్వమునుండి విరమింపనున్న సమయము. ఆకాలములో నేనొక "కూర్మావతార" స్థితియందుండెడివాడను- అనగా లోకవ్యవహారములనుండి దాదాపు విరమించుకొని, ఆత్మోన్ముఖుడనై యుండుట. అదొక అసిధారావ్రతము- బ్రహ్మసాధన. అప్పటి నా భావప్రాబల్యమే యీ కవితాధోరణికి కారణ మనుకొందును. అదొక తపోఫలమో, లేక పూర్వజన్మ సుకృతమో, నేను చెప్పలేను. ఆయా సమయములందు వచ్చిన పద్యములు, పాటలు, వచ్చినవి వచ్చినటుల గ్రంథస్థమొనర్చుకొని, దాదాపు అదే రూపములో యిందు పొందుబరచుచున్నాను. అప్పటి పాటలు, పద్దెములలో మరికొన్ని యీ సంపుటిలో జేర్చబడలేదు. దైవమనుకూలించెడిచో, వాటిని వేరొక సంపుటిగనో, లేక ద్వితీయ ముద్రణమునందో ప్రచురింపవచ్చును. "నందోరాజా భవిష్యతి."

ఇందలి వివిధ గీతికల రచనా సందర్భములను విపులపరచుట కిచ్చట తావులేదు. కాని రచనాకాలము మాత్రము లభ్యమైనచోట్ల ఉదహరించడమైనది.

## ల క్ష ణ వి ష య ము.

ఇందలి పద్దెములు కందములో, కందమాలములో, వెలదులో, ఆటవెలదులో, సీసములో, స్వర్ణములో, నేస

ఱగను, వీటి లక్షణవిషయమై "యతిప్రాసల" గూర్చిన ద్వితీయ ప్రకరణమందు "ఆకాశవాణి" యే ప్రస్తావించుచున్నది. ఇందు కొన్ని "షేక్స్పియర్" అనునటుల, "సుబ్బరాయ కవిరాజవిరాజితములు" ను గావచ్చును.

ఈ సందర్భమున నొకగాథ జెప్పుట యవసరము. వీటి ఆరంభదశలో యీ పద్యములను నా మిత్రులగు బ్రహ్మశ్రీ గొల్లపూడి వెంకటేశ్వర శాస్త్రిగారికి చూపితిని. అందుపై వారు "ఇవియెంతయు రసవంతముగను, భావగర్భితముగను, ఉన్నవి. కాని అచ్చటచ్చట కొన్ని లక్షణలోపములును గలవు. మీరొకతూరి 'సులక్షణసారము' బఠించినచో బాగు" అని నాకు సలహా నిచ్చిరి. అప్పుడు నాకేమియుం దోపక, 'వాణి' నుద్దేశించి, "ఈ యతిప్రాసల గోలయే" మని పృచ్ఛ సేయగ, యిందలి ౧, ౨ పద్దెములే యాపె సమాధానము- తదుపరి యిందుగూర్చి మరికొన్ని పద్దెములును వచ్చినవి.

## ర స పో ష ణ.

కవిత్వమునకు రసమే ప్రధానమని నాయభిప్రాయము. అసలు "సరస్వతి" యే (స + రస + వతి) రసముతో కూడినది. పోతనామాత్యుడు తన కావ్యకన్యకను "రసాలసాల" యని వాక్రుచ్చెను. పాశ్చాత్యులు "సవరను" [Sovereign] అను కాసును మనము "నవరసు", అందుము. అనగా నవరసములతో కూడిన నాణెమనికదా ! ఈ దృష్టితోనే "ఆకాశవాణి" గీతికలను బరిశీలింపవలెనని రసజ్ఞులకు నా మనవి.

"ఆకాశవాణి" రసపోషణలో మన స్వీయ సంప్రదాయములకు ప్రథమ స్థానముండును. ఇచ్చటి గుళ్లు, గోపురములు, క్షేత్రములు, పండుగలు, కళలు, ఆచారములు, అలంకారములు, రీతులు, పారాణి, గోరింటాకు, తిలకము, మంగళసూత్రము, నటరాజ నాగరములు,* ఇన్నిటియందును ఆకాశవాణి పోకడలు సనాతనములు. ఇందలి యింకొక విశేషమేమనగా, వీటి నన్నిటిని శాస్త్రసమ్మతముగ అర్థము చేసుకొని, జీవరహితములైయున్న మన ప్రస్తుత ఆచారములలోక సహజ జీవమును, నూతన వికాసమును "ఆకాశవాణి" యొసంగుచున్నది. అట్టివి యొసంగు పద్ధతి కేవలము ఛాందసము [orthodox] కాదు. ఇచ్చటి సనాతన సూత్రములకు ఆధునిక వివేకానంద, అరవిందఘోష్, గోపాలకృష్ణుల వారి దేశానుసార మొక నూతన సమన్వయ మార్గమును సూచించుటకును "ఆకాశవాణి" యత్నించును.

## సమన్వయ మార్గము.

ఈ సమన్వయము గూర్చి మరొక్కమాట. భారతావనిలోనే కాక యావద్బ్రహ్మాండమందును మానవకోటి యొక నూతన సమన్వయమార్గము నన్వేషించుచున్నది. కేవల హిందూ ముస్లిమేతర సమన్వయము మాత్రమే కాదు—ఇచ్చటి దేశకాలపాత్రములన్నిటియందును సంపూర్ణ సమన్వయమవసరము. ఇందుకు మన ఆంధ్రసీమ యెంతయును తగిన

---

* "ఇంద్రుని గలయా — సొగసు కుసుమం." (22 పుట)

క్షేత్రము. ఇచ్చట మన పూర్వులు "హరిహరనాథు" ని గొల్చిరి. "శివాయ విష్ణురూపాయ" మంత్రమును జపించిరి. "శ్రీవాణీగిరిజా" యని త్రిమూర్తుల నాకేతూరి భజించిన జాతి- మన ఆంధ్రజాతి అట్టి జాతిలో శ్రీ వివేకానందునికి పిమ్మట యొక నూతన బ్రాహ్మణ ధర్మమును చాటిన ఆంధ్రరత్నను గన్న ఆంధ్రావని ధన్యురాలు. అట్టితరి యిచ్చటి దశావతార సూత్రము; చతుస్సాగర మంత్రము, ఉజ్జయినీ కేంద్రము, కృష్ణయుగము. చక్రధ్వజము, గరుడ విమానములు, ఆంధ్ర సముద్రము, మున్నగునవి కేవల మాధునికములు మాత్రమే కావు- ఇందు కొన్ని విప్లవరీతులు నై యున్నవి. ఇచ్చటి ఝాన్సీలక్ష్మి వలె యీ శతాబ్దపు వీరాంగనయే.

## రాజకీయములు.

రాజకీయములలో "ఆకాశవాణి" ది ఉత్తమోత్తమ క్షత్రియమార్గము. ప్రస్తుత ప్రపంచోద్ధరణకై ఒక మత సమన్వయమెట్లు అవసరమో, యిచ్చట రాజ్యోద్ధరణకు మన క్షాత్రధర్మమును పునరుద్ధరించబడవలెనని యామె నమ్మిక. అల్లూరి రామరాజామె అభిమానవీరుడు. అరాచక పద్ధతులామె కసమ్మతములు. యుద్ధమందామెకు ధర్మయుద్ధమే కావలయును. రాజ్యాంగములలో "దండము" నకామె ప్రత్యేక స్థానమొసంగును. ఏలయన, రాజనీతిని దండనీతియందురు కదా! శ్రీ వినోబాభావేల "సైన్యరహిత" రాజ్యములం దామెకు నమ్మికలేదు. ఫార్లమెంటరీ సంప్రదాయము

సనాతనమును, ఉత్కృష్టమును, ప్రాచ్యమైనదో, పాఠకులే నిర్ణయింపగలరు. కోడికూతలు, కాకియరుపులు లేని ఉషస్సేక ఉషస్సేనా ?

ఇటులనే శ్రీ ఆదిశంకరుల 'నృసింహస్తోత్రము' లో

లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్ ॥

అను భావమును, "ఆకాశవాణి" యొక్క నిరంతస్ఫూర్తికిని గల తారతమ్యము. "ఆకాశవాణి" యందలి శాపాయుధమునకు ప్రత్యుత్తరముగ శ్రీ నారసింహులు సాక్షాత్కరించుటయు,

"ఏడుకొండలను మరిమూడు వేల యేండ్లు"

అనగా "నీ గోష్ఠిధర్మ మిచ్చట మూడువేల యేండ్లుండు గాక !" యని ఆశీర్వదించుటయు, నా భాగ్యము. ఆహా ! ఆ పరమేశ్వరుడెట్టి దయామయుడు ! ఎంత శాంతమూర్తి ! సమాగవర్తనుడు ! కాలమెట్లు రూపింపనున్నదో ? ఎవరు చెప్పగలరు ?

"ఆకాశవాణి" లోని ద్వాదశావతార తత్వమును కేవలము గుత దృష్ట్యాయే కాక, షేక్స్పియర్ కవీంద్రుని "మానవ సప్తాంకలీలలు"(The Seven Stages of Man) అను భావముతో పోల్చిచూచినచో, మన భారతీయ సంస్కృతి, ధర్మపథములందలి ప్రాశస్త్యతను మనము గ్రహింపగలము.

ప్రదాయములపట్ల నొక ఉద్ధారకుడుగ ఇచ్చట నవతరించెను. నాస్తిక్యత హెచ్చుపెరుగుచున్న ఈ కాలమున ఆతడాస్తిక్యత నలుదిశల వెదజల్లెను. మన జాతి "బ్రహ్మజాతి" యే యని యెలుగెత్తిచాటెను. రాజకీయములలో వంగీయ వందేమా తరమునకు మారుగ భూపతిత్వా దర్శమును ప్రకటించెను. భాషా విషయమై పాశ్చాత్య మాతృభాషారాధనకు భిన్నముగ శ్రీ పిల్లలమర్రి పినవీరభద్రుని "వాణి నా రాణి" సంప్రదాయము నుద్ధరించెను. అట్టి మహనీయునకు నా "ఆకాశవాణి" శిష్యురాలు.

## విప్లవయుగము.

ప్రపంచమందంతటను యిప్పుడు రానున్న యుగ మొక మహా విప్లవయుగము. ఆటంబాంబు లణిగిపోయి ఆత్మశక్తి విజృంభించవలసిన కాలమిది. ఒక్క మన దేశమందే కాదు. యావద్భూమండలమందును ధర్మమునకు గ్లాని కలిగినది. ఇప్పుడిచ్చట "యదా యదాహి ధర్మస్య" అను గీతాసూక్తి ననుసరించి యొక నూతన ధర్మ మవతరించవలసి యున్నది. ఈ యవతరణమునందు ఇతరులతో పాటు ఆంధ్రులును తమ అగ్రపాత్రను ధరించవలసియుందురు. అట్టితరి 'ఆకాశవాణి' భావము లాంధ్రదేశములో యెట్టి సంచలనము గలుగజేసినను యీ ప్రచురణకై నేనొనర్చిన కృషికి నేను ధన్యుడ నగుదును.

ఈ గీతికలలో కొన్ని నెల్లూరు 'స్వతంత్ర', బరంపురం 'వెలుగు,' నా 'గోష్ఠి' మున్నగు పత్రికలలో లోగడ ప్రచురించబడినవి. ఆయా పత్రికాధిపులకు నా కృతజ్ఞత.

ఆంధ్రరత్న "చాటువుల" లోని యొక పద్యరాజముతో యీ ప్రస్తావన నిక ముగించెదను.

సీ॥ శ్రీగిరిజాపతి స్మితముఖాంభోరుహా
సారస్య మధుపాన సమయములను।
బ్రహ్మాది ముని ముఖ్య ప్రార్థిత దానవ
సంతాన సంహార సమయములను।
వర కుచేలాది భూసుర భక్త సంత్రాణ
సంరంభ సాదృశ్య సమయములను।
నవయుగోదయవేళ భవభయోచిత వస్తు
సంతానము సృజించు సమయములను।
తే॥ గీ॥ ప్రళయతాండవ మద్దండ లీల వెలయ।
రాజరాజేశ్వరీమనో రాజ్యమేలు।
సమయములు నాదు పల్కుల జూడవినుము।
రామనగరీవరాంగ! శ్రీరామలింగ॥

'గోష్ఠి', అమలాపురం.
మన్మథ సం॥ ఆశ్వయుజ
బ॥ ౧౫ ఆం.
ది 31—10—1955.

ఇట్లు బుధజన విధేయుడు,
గుమ్మడిదల వెంకటసుబ్బారావు.

—:0:—

# విషయసూచిక.

—//—

శ్రీరస్తు.

శ్రీ గురుభ్యోనమః.

# ఆ కా శ వా ణి

## ప్రథమశ్రుతి : ఆత్మీయములు.

౧. శ్రీపాదముల జేరు వ్యాపారధారిణ
నిపుణాంగకులము వ్యాపారి కులము ।
ఇలభారతాన్వయం బడ్డిపోయెడి నాడు
పురుషాంతరంబిచ్చు గోత్రి కులము ।*
కలివెంకటేశ్వరాయను సూక్తి సిద్ధింప
నిలవెలయు వేంకటనాయ కులము ।
సృష్ట్యాది స్థితుల కాకరమైన మూలంబు
నిఖిల సుబ్రహ్మణ్యనాయ కులము ।
దేశమా, మాది నాల్గుసంద్రాల నడుమ । ♦
కాలమా, కలికాలమా కృష్ణయుద్ధము ।
ఇందు పాత్రలు పదకొండు నడచి రింక ।
ద్వాదశాదిత్యులము- సాధుపోష కులము ॥

---

* భారద్వాజసగోత్రము — 'ఇండియన్' గోత్రము.

♦ "చతుస్సాగర పర్యంతం"

అల హిమానిలయమునా అక్షమానాథుండు
కొండయార్యుడు గొప్పతాత మాకు ।
శ్రీవిష్ణు నిలయమునా రత్నగిరీశుండు
శేషేశ్వరుండెలన్ తండ్రిమాకు ।
అల కశ్యపునిద్రుంచి, అబలుని రక్షించి
అభయమిచ్చిన యంబ తల్లి మాకు ।
ద్వాపరాంతమున యాకృష్ణుని భ్రాతగా
నవతరించిన రాము డన్న మాకు ।
అల కాశికానాథు పత్ని శ్రీ అన్నపూర్ణ ।
అక్షయగు, ఆత్మరాజ్యంబు నేలుకతన ।
రాజరాజేశ్వరీ యనం బట్టమహిషి ।
సరస సావిత్రి ధర్మంబు బూనిసలుపు ॥

బాలవిద్యను గరపె బాలయ్య గురుడు ।
బ్రహ్మవిద్యను దెల్పె భీమశంకరుడు ।
మధ్య విద్యను* జెప్పె మృత్యుంజయుండు ।
విశ్వవిద్యను♦ దెల్పె వేంకటరంగమ్ ।
రామతారక మబ్బె బాలుడై యుండ ।
విష్ణువిద్యను గరపె గోపాలకృష్ణమ్ ।
విద్యలన్నియు నేర్పు వేదవిదుండు ।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్య వర్యుడనఘు ॥ (1933)

---

ంటర్ మీడియేట్. ♦ యూనివర్సిటీ.

౪. అన్ని క్లాసులలోన నగ్రస్థానము బొంది
గురువుల నుత్కర్ష గాంచువాడు।
పందొమ్మిదవయేట "ఫుడ్డు ఫ్రీడ" మటంచు*
హోమ్‌రూలు మూమెంటు జేరువాడు।
కాలేజి ట్యూటరుగా జేరి వెంటనే గాంధి
కాంగ్రెసుజొచ్చి కాచువాడు।
యానామునుండియా గీతార్థసూక్తిగా
సర్వ ధర్మంబు వర్జించువాడు।
సహకారసంఘుంబు లుద్ధరించెడివేళ
రామకార్యంబనన్ దూకువాడు।
ఇండియన్ బ్యాంకను శంఖిణీ తలదన్ని
ఆంధ్రుల మర్యాద గాచువాడు।
మరణమన్నను యించుక జంకులేక।
గోపకృష్ణుని బ్రతికించి యుత్సవించు।
గోష్ఠినిలయంబు, ధర్మసంస్థాపకుండు।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్యా వర్యుడనఘు॥

౫. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంబనన్
బ్రహ్మకునీడుగా బూనువాడు।
సంపూర్ణ స్వాతంత్ర్య మన సాంబమూర్తి యా
జవహరుల కాదర్శప్రాయు డెవడు।

* "What my country wants is Food and Freedom."

స్వారాజ్యకక్ష నందరింటె మాన్నంద
 ఆంధ్రవనిలో నంజ వేయువాడు ।
ఆత్మరాజ్యంబను విష్ణురాజ్యంబున
 నుత్తమ పీఠంబు దాల్చువాడు ।
గాంధిశ్రేష్ఠుని రాజ్యంబు గీజ్యమనుచు ।
విష్ణుచక్రంబె రాజ్యసాధనమ యనుచు ।
లోకమునకెల్ల తాతృ ధర్మంబు జాటు ।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్యా వర్యుడనఘు ॥ (1933)

ఆంధ్ర విద్యాపీఠగోష్ఠి గోష్ఠియుంచు
 అల్లలాడుచునుండు మందువాడు ।
గోపాలకృష్ణుని మదిగల కోర్కెల
 ముద్దియతో గూడి మురియువాడు ।
సంకర మయమైన యీ ప్రపంచముకెల్ల
 శంకరమతము నిప్పించువాడు ।
రామరాజ్యంబెల్ల యీ కలియుగమందు
 కృష్ణార్పణంబని చాటువాడు ।
గాంధిశ్రేష్ఠుని చకృంబు "చక్రము" వాడు । *
దాసరాజుని రాజ్యంబు దాల్చువాడు । ♦
గోపకృష్ణుని గోష్ఠంబు గాచువాడు ।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్యా వర్యుడనఘు ॥ (1933)

* టట — చకృతత్వమునకు మార్చుట.
♦ త్తరంజనుని స్వరాజ్యపార్టీ.



౭. "నాల్గు సంద్రాల" నంటార్కిటి కట్లాంటికా
ఆఫ్రికా పస్ఫికలని వ్యాఖ్యసేయువాడు ।
గ్రీనిచ్చినున్న యా భూమధ్యరేఖ
నల్లదె! దెచ్చి యుజ్జైని నిల్పువాడు ।
కాలంబునకు క్రైస్తు కొలికెపూసై యుండ
కృష్ణుని యుగరాజు గూర్చు నెవడు ।
క్రైస్తు మహమ్మాద్యులను దేవతలగల్పి
మత ధర్మముల నుద్ధరించువాడు ।
"హాస్య శాస్త్రము" బొక్కలోనవిమియుంచి ।
గాంధి శేషుని మతమెల్ల గంగగలిపి ।
లోకమునకెల్ల బ్రాహ్మణ మతముచాటు ।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్య వర్యుడనఘ ॥ (19-6-33)

౮. రాజ్యాంగమనగనా సప్తాంగమానను
భారత స్మృత్యర్థ మెవ్వడెఱుగు ।
పార్లమెంట్ ప్రతిభల పశుపతి పాల్జేసి
విష్ణురాజ్యము నేలకొల్పు నెవడు ।
విజయవాడలోనున్న దుర్గదేవళ గూడి
కృష్ణ కోటలుగట్ట బూను నెవడు ।
'స్వారాజ్య' మన నాత్మ రాజ్యంబెగాని
మాస్కోనుంచి దిగు మట్టుమాయ కాదు ।
అనుచు ధీరతతో బల్కు నాత్మయశుడు ॥
బ్రహ్మచర్యాది సత్యాగ్రహాగ్రహముల ।

ప్రాని చెండాడి తూతెగ్రింబు బుజ్జగించు ।
ఇల్ల శ్రీ సుబ్రహ్మణ్య వర్యుడనఘు ॥

అప్పుడితరుల తత్వ-మిప్పుడింతుల తత్వ
మెప్పటికెయ్యదో-యెవ్వడెఱుగు ?
ఇప్పుడంతటివాడ - యిప్పుడింతటివాడ-
ఎప్పటి కెంతయో - యెవ్వడెఱుగు ?
ఇప్పుడేలినరాజు - లిప్పుడేలగలారె ?
ఎప్పటికెవ్వరో - యెవ్వడెఱుగు ?
ఇప్పుడు కిరిమిన్నైతి - యిపుడు బ్రహ్మాణ్యాండ-
ఎప్పటికేమౌదో - యెవ్వడెరుగు ?

సూరరాని మనూజులు కలరె మహిని ?
పుట్టినుండి మహాత్ముకు మార్పు మర్మ ।
కనుచు ధీరతతో బల్కు నాత్మయాశుడు ?
ఇల్ల శ్రీ సుబ్రహ్మణ్య వర్యుడనఘు ॥ (23–7–33)

—//—

## ద్వితీయశ్రుతి : యతిప్రాసలగూర్చి.

౧. యతిప్రాసలననేల, శ్రుతికాంతతోఁ గూడి
స్మృత్యర్థరతికేళి సల్పునపుడు।
నియమాదులడ్డునే, నిర్మాతలకునైన
ఆత్మసంయమయోగ మబ్బునపుడు।
"లక్షణసార" నిస్సార విచక్షణనేల,
వీక్షింప లక్ష్యంబు చక్షువులకు।
సూత్రంబులేల, మంగళ సూత్రధారి-యా
కవయిత్రి, గాయత్రి కౌఁగలింప।
'అహంబ్రహ్మాస్మి' యను ధీరవర్యునకును।
నూతన స్మృతి ధర్మంబు నిల్పువేళ।
గోడలడ్డునె, కోటలు కూలునపుడు।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్య వర్యునకును॥

౨. యతిప్రాసలననేల, నతి సూటి వర్తించు
నాత్మసంయమయోగ మబ్బునపుడు।
నియమంబులవియేల నియ్యమందుటకునై
తియ్యని భ్రమలుయ్యా లూరుచుండ।
శాస్త్రకట్టనివట్టి భ్రాంతితోఁ గననేల,
నతి చమత్కృతి రతి దేలునపుడు।
కందపద్దెములేల. వందలకొలదిగా
నందమౌ విందారగింపులుండ।

ఆటవెలఁదులవేల, సయ్యాటలాడు ।
కాళిదాసునిఁ దాసి, కాంతాలలామ ।
చేరి సేవలు సేయంగ జెనటికైన ।
అబ్బకుండునె, తబ్బిబ్బు సేయుకైత ॥ (26-6-33)

3. అయ్యొ! వైయ్యాకరణీ ।
కుయ్యోయని కూయనేల, కూపస్థుడవై ।
తియ్యని భ్రమలుయ లూరఁగ ।
సయ్యాటలు సేయుకుందె సారస్వతితోఁ ॥

4. వీనులకు విందు గొల్పెడి ।
వీరాలాపములు చెంత జేరుచునుండన్ ।
ధీనులగు హీనమతులకు ।
నోరూరునె, చెవులు కుటునె, ధీరవరేణ్యా ॥

5. సరసంపు రసస్ఫూర్తియు ॥
సమయోచితమైన ధీర భావశతంబుల్ ॥
సరసను జేరుచు నుండఁగ ।
నిరసింతునె వాని సెజ్జ నీరసబుద్ధిన్ ॥

6. "కలికాలమయ్యె-నాకా ।
కలి" యంచును కైతవేడ కాఠిన్యుడవై ।
చోకలియిత్తునె రోయుచు ।
కౌఁగలి జేరంగవచ్చు కాంతామణికిన్ ॥

7. యతిప్రాసలనఁగ నేటికి ।
యతులకు సన్యాసమబ్బె సారసవదనన్ ॥

రతిదేలు సరసులుండగ।
శృతికిని ప్రాణంబు నాదబ్రహ్మము సువ్వే ॥

౮. ప్రియంపు లేమసొగసును।
పసగూర్చెడి పాయసములు ప్రార్థింపంగన్ ।
ప్రాచీన కాలమందలి ।
బాసలు, న్యాసముల వేల, బానిసప్రాసల్ ॥

౯. ఏటి జలములు గర్భంబు లింకియుండ ।
గట్లు కాల్వల గర్వంపు నీటుకాని ।
పుష్కలంబుగ వచ్చు పుష్కరిణియెదుట ।
విష్కలంబుగ నాగునే విష్కంభములును ॥

౧౦. గట్టు విరుచుక గగనంబు వెల్లివిరియు ।
గోలకూల్చుక రాజ్యంబు కోటవెలయు ।
దేహమును వీడి జీవంబు ఆత్మజెందు ।
నవయుగోదయవేళల నారసింహ ॥ (4-8-1933)

—:0:—

## తృతీయ శ్రుతి : దైవప్రకరణము.

### శ్రీ దుర్గా స్తవము.

౧. దినమే – సుదినామూ ।
దుర్గను గను – దినమే సుదినామూ ॥

౨. పాదములకు – బల్ ।
పసందైన – యా ।
పసపు – పూతలును ।
రక్కసి – కోటుల ।
నిక్కంబుగ నిల ।
చిక్కు బిక్కుగా ।
ద్రొక్కిం చెడి మా ।
రాణిపా దముల ।
రేణువు లంగను ।
దినమే – సుదినామూ ।
దుర్గను – గను – దినమే – సుదినామూ ॥

3. గమనా – హంస – గమనా ।
బల్ – తళుకు బెళుకులగు ।
త్వరిత గతులతో ।
యిందు నందనక ।
చిందుల ద్రొక్కెడి ।
ఇందు వదన ।

అరవింద పాద ।
శ్రీపాద - శుభద ।
దినమే - సుదినామూ ॥

౪. ధాత్రీ - జగద్ధాత్రీ ।
బ్రహ్మ - బీజమున ।
వీరుల - శూరుల ।
ధీరు - లుదారుల ।
పెక్కుల - గనియెడి ।
ధాత్రీ - జగద్ధాత్రీ ।
ఈ - పృథ్వి యెల్ల నీ * ।
యోని - కూటముచె ।
బ్రహ్మ - మయంబుగ ।
సృష్టి జేయు - యో ।
క్షేత్రి - సుక్షేత్రి ।
నిను - గను ॥ దినమే - సుదినామూ ॥

౫. మత్త - గజములవి ।
మత్తే - భంబులు ।
మర్దిం - చుటకు ।
నృత్త - కుంభములు ।
గబ్బి - గుబ్బలతో ।
యుబ్బిన - యురమున ।

* పృథ్వీయోనిః — (గాయత్రి)

సంత - రంగమున ।
అనంగ - రంగుని ।
విష్ణు - తనయునిని ♦ ।
తూగు - టుయ్యాలలో ।
నింపుగ - సొంపుగ ।
నాడుచు - బాడుచు ।
సొగసు జేయు - మా ।
మాధురి - దుర్గీ ।
నిను - గను ॥ దినమే సుదినాము ॥

౬. ధారీ - వల్లభ పాణిధారీ ।
శత్రుల - జీవహారీ ।
వల్లభు - జీవమె ।
సూటి - సూత్రముగ ।
హృదయ - రత్నముల ।
నింపుగ - నదుముచు ।
చిత్త మెల్ల - నీ ।
చిత్తంబున - అతి ।
చిత్ర - రీతులను ।
అల్లి - బిల్లి గా । నల్లుకొన్న - యో ।
మంగళ సూత్ర - ధారీ ।
నినుగను - దినమే ॥ సుదినాము ॥

♦ విష్ణుహృదయం - (గాయత్రి)

౭. మోము - ఆ।

ఇంపు - గొల్పు నీ

తేనియ - లొల్కెడి।

సొంపు - పెదవులును।

సత్యము - లోయన।

ముత్యపు - పండ్లును।

వెన్నెన - కిరవగు!

వెన్న - ముద్దలను।

చక్కని - చెక్కులు।

నల్లని - వాడగు।

నందుని - పట్టితో।

రతి చేలెనా - యను।

కళ్ళ - కాటుకయు।

తెల్లని - కన్నుల।

వల్లభు - జేరగ

మన్మథు - బాధల।

కోర్కె - లేక।

వె - ల్లువగా - బారెడి।

బా - ష్పా - నందము।

గల - మో - మూ।

నీ ముద్దు - మోమునుగను॥

దినమే - సుదినామూ॥

౮. పంచప్రాణములు * ।
నింపుగ - వీణను ।
'చిణి' 'చిణి' 'చిణి' యని ।
మీటుచు - బాడుచు ।
లోకము - లన్నియు ।
లీలగ - నడిపెడి - సాధ్వీ ।
సరసంపు - సాధ్వీ ।
సావిత్రీ - గాయత్రీ - కవయిత్రీ ।
నిను - కౌగిట - జేర్చుక ।
వింత - వింతలగు ।
కైతల -రీతుల ।
దేలెడి - సల్పెడి ।
నిత్యా - నందము ।
సత్యా - నందము ।
రత్యా - నందము ।
గల - దినమే ॥ సుదినామూ ॥
౯. అంబా - రుద్రాంబా ।
హిమకరు - వాసమె ।
తెల్లని - వన్నె ♦ ।
ముక్కంటికి - నీడగు ।

* "ప్రాణాపానవ్యానోదానసమానసప్రాణా"
♦ "శ్వేతవర్ణా" - (గాయత్రి)

కమ్మని - కస్తురి ।
యిమ్మగు - తిలకము ।
రుదు9ని గల - యూ † ।
సొగసు - కురులు యీ ।
బ9హ్మ - ణ్యుండగు ।
సుబ9 - హ్మణ్యున ।
కీడగు - బుద్ధియు ।
బలము - తేజమును ।
శీలము - యశమును ।
గల - ఓ - యంబా ।
దు - ర్గాం - బా ।
నిను - గను - దినమే ॥ సుదినామూ ॥
దుర్గను-గను - దినమే ॥ సుదినామూ ॥

(17-8-33)

---

† "రుద9శిఖా" - (గాయత్రి)



## అర్ధనారీశ్వరము.

౧. మత్తగజమవు నీవు పురుష సింహము నేను
మర్దించుటకు నీదు కుంభములను ।
తేనియలొలొకెడి పెదవుల కుసుమంబు నీవు
ఆ మధు దేలు తేటి నేను ।
చక్కని చెక్కుల నవనీతమవు నీవు
అద్దానిని దొంగిలు వెన్నుడేను ।
తెల్లని కన్నుల రతి దేలు దేవివి
అందు నల్లని నందు పట్టి నేను ।
హృదయ సాగరమందున వీచికలుగ
పొంగి పొరలెడి ఆర్ద్రి తరంగమీవు ।
నిన్ను అంబుధి దాటించి దరిని జేర్చు
ముక్తిజూపెడి మాధవు నావ నేను ॥
నీవు నేనని వేరుగా బల్కనేల ?

౨. నీవు నేనని పల్కంగ యోలతాంగి ।
ఏలనే ? విను ! వికసించు పుష్పమందు ।
మధ్య మండలమున వెలయు పొడియు నేను ।
వాయువేగంబునను బోయి నాల్గు దిశల ।
నింపి, నా యింపుసొంపును నెల్లెడలను ।
దెల్పి దుష్టుల ఘ్రాణ్ద్రోలి, ముక్తి జూపు ।
మాధురీ ఘ్రాణ గంధంబు నీవకావె ?
నీవు నేనని వేరుగా బల్కనేల ?

3. ఆపములలోని అమృతాపస్సు నేను ।
అందుగల రసజ్ఞత వెల్లువలుగ ।
మృత్స్నమయమైన యీ విశ్వమెల్ల యెడల ।
జేర్చి పరివహింపజేసెడి సారసవీవు ।
నిత్య జీవివి - సంజీవి - నాదు జీవి ॥
నీవు నేనని వేరుగా బల్కనేల ?

4. రూపములకెల్ల మన్మథ రూపమేను ।
నాదు సొంపును సొగసును యిలకు జూపి ।
మానవులనెల్ల మోహాబద్ధులను జేసి ।
క్రూరహింసాది రక్కసి రూపులకును ।
సరస సౌందర్యమును జూపు రూపవతివి ।
లక్ష్మి సారస్వతుల యేకమూర్తి వీవు ॥
నీవు నేనని వేరుగా బల్కనేల ?

5. వాయువులకెల్ల ప్రభుడగు మరుత నేను ।
నాదు స్పర్శంపు రెక్కల బుట్టినట్టి ।
మలయ మారుత స్పర్శంబు నీవకావె ॥
నీవు నేనని వేరుగా బల్కనేల ?

6. నాదములలోని ప్రణవనాదంబు నేను ।
నాదు శబ్దంబు నాల్గు సంద్రాలదాక ।
పిండియుండిన బ్రాహ్మణ బృందములకు ।
సాంగవేదాంగ పదముల క్రమములతోడ ।
సరససూక్తుల స్మృతులను తెలియజెప్ప ।

ముక్తి కాంతవు, సావిత్రి వీవకావె ?
నీవు నేనని వేరుగా బల్కనేల ?

౭. నీవు నేనని వేరుగా బల్కనేల ?
ఆత్మయొక్కటి జీవముల్ రెండుకాని ।
అదియుమాత్రము అన నేల యిందువదన ।
జీవమును దేహమొక్కటై వేడ్క వెలియ ।
అర్ధనారీశ్వరులమేము-అమ్మతులము ।
కాము బాధల కోర్వంగ లేక కాంత ।
వింతరీతిగ వామభాగమున జేరి ।
కాంతు కౌగిటజొచ్చి అర్ధాంగియగుచు ।
నిత్యరతిదేలు భారతీ యంబమాకు ।
భృత్య - గరసంపు సాధ్వి-యిల మృత్యుహారణ॥
నీవు నేనని వేరుగా బల్కనేల ? (1933)

౮. కుడివైపు కృష్ణుండు - వామభాగంబున
వామాక్షి - రాధిక - యవతరింప ।
పూర్వంబునను భాను - డుదయించి వెలయు
నా పశ్చిమాంబుధిజూడ-నిందుముఖియు ।
రేయుంబవళులొక్క - లీలగా బ్రవహించు
కాలస్వరూపమో - యనగబరగు ।
బ్రహ్మయు భార్యయు - సొంపుగా సావిత్రి
సామ్రాజ్య స్వారాట్టు - శేలుచుండ ।
శంకరుడు-శక్తి యునుగూడి - నిక్కముగను ।

రక్కసుల నుక్కఁజేసి మా - దిక్కుఁజేరు ।
భక్తకోటికి భుక్తిని - ముక్తినొసగు ।
అర్ధనారీశ్వరులమేము - అమృతులము ॥
నీవు నేనని వేరుగా బల్కనేల ?

(1933)

—§§—

## శ్రీ సుబ్రహ్మణ్యా నారసింహా సంవాదము.

(మంగళగిరి నరసింహాస్వామితో సంభాషణ)

బ్రహ్మణ్యులు :-

౧. నేటికిప్పటికేడు వందలకు పైగ ।
వత్సరంబుల యాదిగా నాదువత్స ।
లైన యీ బ్రహ్మజాతి ప్రజలు ।
మతము ధర్మంబులను వీడి మ్లేచ్ఛులైన ।
కలికి తురకల క్రైస్తవ సేవజేసి ।
వేదమునువీడి. బైబిలు చేతబూని ।
గుళ్లు గోపురములనెల్ల కూలగొట్టి ।
రాజ్యమెల్లను రారాజు పాలజేసి ।
కోటలన్నిటి పాటిమిట్టిగను ద్రోలి ।
అర్థమెల్లను మెల్లగ గోలుపోయి ।
కళలనన్నిటి కాటికాపరుల కిచ్చి ।
జీవశవమైన యీ భరతభూమి యనగ ।
పశ్చిమోచ్ఛిష్ఠ భుక్తుల బ్రతుకుచుండ* ।
ఏమిసేయుచు నుంటివి నారసింహా ?

౨. నాల్గు సంద్రాలదాక యీ పృథ్వియెల్ల ।
ప్రజలు ముక్తిని వీడి త్రైవర్గ విద్యబడసి ।

* "Living on the intellectual refuse of the West." —Sir S. V. Ramamurty.

హారిని విడచుచు హిరణము సేవజేసి।
కశ్యపుని దుష్ట సంతతి వారలగుచు।
నాదు సొంపగు యీకృష్ణ యుగమునెల్ల।
కష్టకాలపు కలిగాను సేయుచుండ।
ఏమిసేయుచు నుంటివి నారసింహా?

3. నీదు గర్భంబునందున బుట్టినట్టి।
అగ్నిజ్వాలలు యుగయుగాంతరమునుండి।
పోయు తీయని పానక వరదచేత।
చల్లబడిపోయెనా యేమొ, తెలియజెప్పు।
లేక నీగోళ్లు వక్రలు అయ్యెనేమొ?
లేక నీపండ్లు ముదిమిచే యూడెనేమొ?
లేక కాలభైరవ భీకరమూర్తియగుచు।
ఇలను నరులకు వెరచిన సింహమైతొ?
లేక మరియేమికతన మౌనారసింహ?
ఏమిసేయుచునుంటివి? నీవు యిచట॥

౪. అగ్నిజ్వాలల నంతమొందించనట్టి।
శత్రు రక్తసికోటుల గూల్చునట్టి।
అబల బాలుర గావంగలేనియట్టి।
జీవశవమును బోలెడి మట్టిముద్ద।
ఆరిపోయిన మంగలి కొండవైతె *।
ఏల నీకేల యీపత్య పానకాలు?

* మంగళాద్రి.

ఏల నీకేల యీ మంగళంపు ధ్వనులు ?
ఏల నీకేల కర్పూర హారతులును ?
ఏల పూజలు, సేవలు, ఉత్సవాలు ?
ఏల యీ పేద దక్షిణ కానుకలును ?
ఏల నీకేల సెప్పుమ యోనారసింహా !
ఏమిసేయుచునుంటివి, నీవుయిచట ?

౫. నవయుగోదయ సమయంబు యేగుదెంచె !
అల్ల చే ! అరుణోదయంబయ్యె తూర్పుదిశల !
'కొక్కురో !' యని పల్లెల నెల్ల యెడల !
కోడి కూతలు వినవచ్చె పేదలిండ్ల !
'కావు ! కావ'ని కాకులు కూయసాగె !
రాత్రియంతయు గాఢంపు నిద్రబోయి !
వీనులకు విందుగొల్పెడి 'కిచ-కిచ'లతో !
విడచుచున్నవి గూళ్లను విహగములును !
కాలసర్పంబునను బోలు రాత్రిఘాము !
అమృతాదిత్యు మఱుమైన సూర్యభాను !
ఛాయ వెలుగుల బరువెత్తి పశ్చిమమున !
నాగలోకంబునకొ * లేక పాతాళమునకో ♦
జనుచునున్నది వేగమె యెల్ల యెడల !
రెండు బంగరు సింగంపు కాతు యూపె !

---

* ఈజిప్టు		♦ అమెరికా.

తెల్లవన్నెయు, మెరసిని ముఖముగలది।
సూర్యభానుప యనుంగు కూతురబల।
సరస సావిత్రి, బ్రహ్మణ్యు భార్యయాపె।
నాల్గు సందార్లదాక యీ పృథ్వియెల్ల
నిండియుండిన గోవుల బ్రాహ్మణులకు।
మాతృదేవత, వేదసుతములకు దేవి।
క్రూర రక్కసి కోటుల సుక్కజేయు।
అంబ - అమగో! ఇలక్ బయల్ వెడలె।
వినుము నే జేతు శపథంబు నారసింహ!

౬. ఇలను ప్రహ్లాద సాధన సిద్ధిబొందె।
ఇకను నారసింహము వెలుగొందు వేళవచ్చె
నీవు నిద్రను మేల్కాంచి. శత్రువుల ద్రుంచి।
సాధులబ్రోచి. యీ పృథ్వియెల్ల।
విష్ణురాజ్యము నెలకొల్ప జేయుమయ్య।
అపుడె నీయింటి కేనును దుర్గవచ్చి।
కృష్ణజలములనన్నిటి నీకుదెచ్చి।
పొలములన్నియు చెరకు పైరులనువేసి।
పానకము జేసి నీబొజ్జ నిండపోతు।
లోకమెల్లను మెఱుగంగ నీకు గుళ్ళు।
గోపురంబులు, సత్రముల్, సావడులును।
మంగళంబులు, పూజలు, సేవలెన్నొ।
కొండ శిఖరంబునను నీకు జరుపుకొందు।

లేనిచో - నీకు యున్నట్టి కొంపయైన ।
మాలమాదిగ మ్లేచ్ఛాది మానవులచే ।
చితుకద్రొక్కించి పాడుబెట్టగనుచూడు ।
వినుము నామాట నిక్కంబు మూడుసార్లు ।
త్రిప్ప సాధ్యంబుకాదు ముక్కంటికైన ।
వినుము నేజేయు శపథంబు నారసింహా ॥

శ్రీ నారసింహులు :-

౭. తండ్రి! ఏల నామీద యీ ఆగ్రహంబు నేడు?
లక్షీ మయుతమైన వృద్ధ బ్రాహ్మణుడ నేను ।
నీదు యాజ్ఞలచే పూర్వలోకంబునందు ।
యుద్ధములుచేసి, అలసి, ఆగి చల్లారినట్టి ।
నిప్పులేనట్టి యీ అగ్నిపర్వతముజేరి ।
నీదు నామంబు స్మరణకు దెచ్చుకొనుచు ।
భక్తకోటులు యొసగెడి పానకంబు ।
పండ్లు ఫలములతో కుక్షి బాధదీర్చి ।
తపముసేయుచు నిందుంటి నంతెకాని ।
యీ మిక్కుటపు కలికాలంపు మహిమలెల్ల ।
నాకుసేయంగ నలవియే? నేడు సెపుమ!
నరులలోకెల్ల పురుషసింహమవు కావె ।
సరస సావిత్రి భర్త బ్రహ్మణుడ వీవె ।
అమ్మ, మాయమ్మ రాధామనోహరుడవె ।
ఇలను వెలసిన దుర్గేశ్వరుండ వీవె ।

కాలమిా కలికాలంపు భర్త వీవె ।
రక్కసులనెల్ల స్రుక్కించు హర్త వీవె ।
అర్ధరీనాశ్వరుడ వీవె, పృథ్వియెల్ల ।
విష్ణుచక్రంబు, శంఖువు చేతబూని ।
ఏలుకొనుమిావు మరిమూడు వేల యేండ్లు ।
నీదు యాజ్ఞల మీారంగ గల్గువాడు ।
మూఁడులోకములందున లేడు నిజము ।
నాదుమాటల బెడసెవిని బెట్టవలదు ।
మాదు ఆశీస్సులన్నియు నీకుగలుగు ।
లోకములు మెచ్చువిన్న బ్రాహ్మణ్యుడనుచు ।
నీదు వాణిని లోకంపు రాణివనుచు ।
ఏలు వంశాభివృద్ధిగా యేలుకొనుము ।
భరతభూమిని నాల్గు సంద్రాలదాక ।
ఏలుమేలుము యీభువి ముక్తి జెంద ।
పోయివచ్చెద ! ఏలుకో, బ్రాహ్మణవర్య ॥

(20-1-1934)

—*—
* *

## ద్వాదశావతారములు.

౧. మాతృగర్భమునందు మీనమై వెలియంగ
మత్స్యావతారమై బరగువాడ ।
కాళ్లుసేతులు తలల్ కలుగంగమాయుచు
కూర్మమై వెలసితి కూర్మియిలను ।
ఆరవమాసంబు యాదిగా చిత్తంబు నాత్మ
యహంకృతుల్ వెలియుసగవా ।
రూపంబునను గుట్టలో నట్టె పొడచుచు
నవమాసగర్భంబు నిండగానె ।
భూమి ఆకసమొందుననుగాక నడుము ।
రెండు కంబములను తొడల్ నడుమనుండి ।
రక్తమాంసాది ప్రేవులు వేఱ్క వెలియ ।
నారసింహుని రూపున జననమంది ॥

౨. చిన్ననాలనె పెద్ద బుద్ధులబ్బెడి వటువు
వామనమూర్తియై వెలసినాడ ।
వయసు వచ్చినవెన్క శాపశరముల బూని
రాజకోటుల దునుమ రాముడైతి ।
ఆవెన్క నాసీత లక్ష్మణు గూడుక
తాటకి రావణు దునుమినాడ ।
ద్వాపరాంతమున యాదాముని గూడుక
యాదవ కులమందు ఉద్భవించి ।

వెలసియుంటిని శ్రీకృష్ణ నామకుడను ।
వేదములకెల్ల మూలంబు ఆత్మ నేనె ।
కలియుగపు ధర్మమెల్లను నడపువాడ ।
ఇలను బ్రహ్మణ్యుడందురు మునులు నన్ను *

3. వస్త్రంబులకు పట్టు పీతాంబర వస్త్రముల్
మేలుపించపు పాగ ప్రీతిమాకు ।
వెన్నముద్దలు గోవు పాలు మీగడ పెరుగు
తేనె చక్కెర ఆరగింపుమాకు ।
వీనుల కింపుగా ప్రణవనాదము సల్ప
వేణువు మా పెద్ద బంటు యిచట ।
ప్రకృతిస్వరూపియా శృంగార సౌందర్య
శక్తుల వెదజల్లు రాధ రాణి ।
గరుడవాహన ధ్వజములు కల్గువాడ ।
శంఖ చక్రములవి రెండె ఆయుధములు ।
దుష్టశిక్షణ, శిష్టరక్షణయు మాకు ।
నిత్య ధర్మములవి - వేద వేద్యులరము ॥

4. కారులతా కౌరుల మదమణగించుచు
ఋజుమార్గ వర్తుల రాజుజేసి ।
అష్టోత్తరశతంబు లుపనిషద్భార్యలు
పదియారు వేల యామంత్రములును ।

---

* బ్రహ్మణ్యో దేవకీపుత్రో । బ్రహ్మణ్యో మధుసూదన ।
బ్రహ్మణ్యో పుండరీకాక్ష । బ్రహ్మణ్యో గరుడధ్వజ ॥

ఇల గోపికలుగ నవ్వరియించి కొల్వంగ
రాసలీలను వారి సేలుచుండు ।
వేదంబులను నెల్ల వ్యాసప్రోక్తముజేసి
భారత ధర్మంబు నుద్ధరించి ।
పూర్వ పశ్చిమంబులు యీశు డేసుడనుచు ।
గోపకులు నన్ను కృష్ణుండు, క్రైస్తువనుచు ।
ఇలను గొలువంగ యాదవ కులము మాది ।
ఇందు మొసలము బుట్టెను కనరె మీరు ॥

౧. కలియుద్ధమను నాదు కృష్ణయుద్ధం బిల
నడచె నిప్పటి కైదువేల యేండ్లు ।
ఇందుగల దేశంబు నాల్గు సంద్రల నడుమ
యీ తృ భూమండలంబు మాదె ।
నాదు అంశను యిచట జీర్ణధర్మోద్ధరణ
జేసి మనుజుల బ్రోవ వెలసినారు ।
గౌతమబుద్ధుండు, ఏసుక్రీస్తుడు, మహాలి
ప్రోఫెటమ్మహమ్మద్దు లనెడివారు ।
శంకరుని యంశ నగుమద్యొ భరతభూమి ।
ఇకను– లోకమెల్లను శంకరమయమెయనగ ।
పృథ్వికంతకు బ్రాహ్మణ మతముచాటు ।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్య వర్యులరము ॥

—⬥⬥⬥—

## దేవతలతో సంభాషణ.

౧. గుళ్లు, గోపురములలోని కాంతలార !
దేవతలమను పేరిట ఎల్ల యెడల ।
వెల్లి విరిసియు మీరుండ కొల్ల గాండ్రు ।
దేశమెల్లను మెల్లగ గుల్లగొట్టి ।
కోలహాలమును సేయంగ నేమికతన ?
ఇంత దారిద్ర్యమేల మా లక్ష్మియుండ ?
ఇంత ఆకలి యేల ? ఓ అన్నపూర్ణ ?
ఇంత అజ్ఞానమేల ? యో శారదాంబ ?
ఇంత శక్తిహీనత కేమి కారణంబ ?
విజయపుర రాణి, శ్రీవాణి దుర్గరాణి !
మీరు యెల్లరు సెప్పరే – నేడునాకు ॥
౨ అనుచు బ్రహ్మణ్యుడాడిన మాటలకును ।
ఇంతులెల్లను మెల్లన చింతవీడి ।
సొంపుసొంపుల మిసిమిసి యింపుసగుల ।
ముద్దు మోముల చేడియల్ మురుపుజెంది ।
మబ్బువీడిన యిందుని కాంతిపగిది ।
రాహువిడచిన భానుని తేజములతో ।
కిలకిలాయంచు యెల్లరు వేడ్కసేయ ।
దుర్గదేవత పల్కె బ్రహ్మణ్యుతోడ ॥
3. భరతభూములకెల్లను భర్త వీవె ।
పృథ్వియంతయు నేలెటి కర్త వీవె ।

దిక్కులనెల్ల బ్రోచు హర్త నీవె।
గొల్ల లేనట్టి గొఱ్ఱెల మందబోలి।
ఇంతదనుకను నీరాక కెదురుజూచి।
వేచియుంటిమి - మావటివాడు లేని।
మదపు టేనుంగులను బోలు పేదసేన।
లేదు నడిపెడి యజమాని లేదు మాకు।
గాన మాశక్తి సామర్థ్య మెల్ల యిపుడు।
సరస సౌందర్యములు ధనవిద్యలెల్ల।
నేడు వికసింపకున్నవి - నీదురాక।
కెదురుసూచుచునుంటిమి యింతదనుక।
నేటినుండియు ఈశ్వర! కావుమయ్య।
నడుపుమయ్య యీ సేనల - నీదువెంట।
వచ్చి, యీ రాజ్య యశములు, ధర్మములును।
కోటలన్నియు, రాజ్యముల్, విద్యలన్ని।
కళలు, గానంబు, ఫలములున్, కానుకలతో।
దెచ్చి నీకొప్పగించెద యిపుడె నీవు।
ఏలుమేలుము యీభువి ముక్తిజెంద।
ఏలు! నీపాల దాసీల మగుదుమేము॥

:0:

## అమరేశ్వరుడు.

౧. కృష్ణానదీతీర - మమరుల కిరవైన
యూరు మా అమరా - వతీపురంబు।
వన్నెకెక్కిన వాసి - రెడ్డి నాయని దొడ్డ
పురము భూతల స్వర్గ - మమరపురము।
దేశదౌర్భాగ్య సం - క్షోభ దారిద్ర్యముల్
బాప వెలసిన పురము - అమరపురము।
కరతురకలక్రైస్త - వాది మునుపరకోటు
లకు వీరస్వర్గంబు - యమపురంబు।
అందు వెలసిన అమరుండు - ఈశ్వరుండు।
పృధ్వి యోనిని వీడుచు - ఆకసమును।
జూరిబోవంగ యబ్బునే - నిబ్బరముగు।
రాజ్యయశములు, ధనములు - రమ్యములును?

౨. అమరేశ్వరా! నీకు - గలయట్టి లింగంబు
చాలదా? ఆపదల్ - బాప భువికి।
అతి కాముకుడవౌచు - అంబనుగూడుక।
అసలు మరచితివేమొ - శిసలుపనులు।
రెడ్డినాయని రాజ్యమెల్ల - దొడ్డలుదొరల్
గడ్డిబీడుకుగూడ - కరవుకాగ।
నీదుసేనలు పరిజల్ - సేవకావృత్తిచే
దాస్యశృంఖలబద్ధు - లగుచునుండ।

పెద్ద వీర్యంపువాడవు - దొడ్డ దొరవు ।
నిద్దురనువీడి రాజ్యంబు - నేలుకొనుము ।
లేనిచో నీదు వీర్యంపు - లేశమైన ।
నాదుపంపున కంపుము - వీరవర్య ।
రక్కసుల నెల్ల సుగ్గికింతు - నీక్షణమున ।
అమరపురవీర - యోధీర - యుద్ధభీర ॥

—)(—

# శ్రీ రా ము స న్ని ధి కి.

౧. శ్రీరామా ! నా మనవి వినగరాదా ।
పరంధామా ! నా పలుకు వినగరాదా ॥

౨. త్రేతాయుగ – పురుషుండవు ।
మును వానరసేనల గూడుక ।
లంక కేగి – రావణు దునిమి ।
సీతా – భామ నేలిన – యో రఘుకులరామా ।
నా మనవి వినగరాదా ॥

3. కలియుగ పురుషుడై – శ్రీకృష్ణుండని ।
సకలశాస్త్రములు – సంధ్యలు చాటగ ।
హేకృష్ణా ! హేకృష్ణా ! హేకృష్ణా !
యనుచు నిన్ను – బిలుచుచుండ ।
కోపమేల ? తాపసోత్తమ– రామా ।
నా మనవి వినగరాదా ॥

౪. ఈకలియుగమున – భువిలో ।
కృష్ణునంశ – వలన కాదె ।
అవతరించిరి – బుద్ధ, క్రైస్తు ।
శంకరుండు – బ్రహ్మణ్యులు ।
శ్రీరామా ! నా మనవి వినగరాదా !
పరంధామా ! నావలుకు వినగరాదా !

—||—

## దీపావళీ మహాత్మ్యము.

౧. భూదేవిపుత్రుండు - ఇహమాన కధిపుండు
ముక్తికాంతనువీడు - మూఢుడధిప ।
రారాజులకువైరి - రాజుల నెల్లర
మర్దించు క్రూరుండు - రక్కసియట ।
రాణులు పదియారు - వేలమందిని బలా
త్కారంబు చెరబట్టు - జారుడతడు ।
ఆముష్మికము లేని - ఐహికబద్ధుండు
నరకజీవితమేలు - నరుడతండు ।
అట్టి నరకాసురుని యుద్ధరంగమందు ।
చిత్రవధజేసి దేశంబు క్షోభ బాపి ।
ఇంతులనునెల్ల ముక్తిని గూర్చువాడు ।
సత్యభామా సమేత శ్రీకృష్ణబ్రహ్మ ॥

౨. లోకమెల్లను దట్టంపు చీకటులను ।
ఐహికములగు దుర్గంధ వాయువులను ।
నరక హేతువులగు క్రూర రక్కసులను ।
పారద్రోలంగగల్గు యీ పండువిలను ।
దేశదేశంబులకు దీపయావళియు కాదె ?
స్నానసంధ్యలు సల్పెడి భోగికాదె ?
పక్వ పర్వాన్నములుసేయు పండువవదె ?
విజయసూచకమగు బాణసంచాలుకాల్చు ।

సర్వస్వాతంత్ర స్వారాజ్య సమిథికాదె ?
ఇట్టి యుత్సవమొక్కటి మైనగల్గు।
ప్రజల జీవితమొక్క క్షణికముగనైన।
ముక్తిపదమును గోరిలదా ? మహినియెల్ల।
ఇట్టి పండుగలింకొక్క దేశమందు।
చూపగలరారె యీజగ జెట్టులైన।
బ్రహ్మసామాజికులు - గాంధి శిష్యులైన ?

౬. నేటి దీపావళీ భరత దేశముకెగాని।
రేపువచ్చెడి దీపాల పండుగిలను।
నాల్గు సంధ్రాలనడుమ యీ పృధ్వియెల్ల।
ఉత్సవము సేయవలెజువీ మీరలంత।
బ్రిహ్మమును నమ్మియుండిన జూడగలరు।
ఇందు సందియ మింతైన వలదు, వలదు।
నమ్మి చేరిన బ్రహ్మము మీకునొసగు।
ఇహము, పరమును, రెండును శుభదముగను॥

(1933)





# గీ తా ర హ స్య ము.

౧. బ్రాహ్మణ్యుండయ్యు - ఆత్మధర్మంబు మరచి।
గీతలకు కర్మ మర్మంబు దెల్పె తిలకు।
వైశ్యుడై గాంధి విశ్వంబె కర్మమనుచు।
వ్యాఖ్యలను జేసె - గీతల ఖర్మమేమొ?

౨. సర్వ ధర్మంబులనువీడి - సరస జేర।
నన్ను గొల్చెడివాడె - యథార్థ భక్తు।
డనుచు గీతల యర్థంబు తెలియజెప్పు।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్య వర్యుడనఘు॥

౩. కానక కర్మయోగమని వ్రాసిక బల్కిరి
గాంధి తిలకులీ ముప్పదియేండ్లనుండి।
మరి ముప్పది యేడులు దేశమెల్లెడన్
కర్మ గడంగినేని ఫలమేమొ కలుగంగరె।
యజ్ఞమైన - యీ ముప్పదికోట్ల మూక
యిల కర్మణులై చెలరేగిరేని ము।
ల్లోకములాగునే చెనటి ఘాటికి,
సూటికి, కర్మవాటికిన్॥

౪. కావున కలికాలంబున।
కర్మంబులు మరచి, విడచి, ధర్మజ్ఞులరై।
బ్రహ్మము నమ్మక బ్రతుకుడి।
సర్వము శ్రేయంబె యగును సాధకులారా॥

(25-7-33)

## మతముల విషయము.

౧. బుద్ధిగోరువాడు బుద్ధుని జేరును *।
అంతెగాని "ఆత్మ" దెలియునతడు।
'సోహమ్మ'ని బలికి సొంపుగా నేలడా।
ఇలయు, జలగము, నాల్గు దిశలదాక?

౨. బౌద్ధమున బుద్ధి దెల్పును।
ఇస్లామున నింతులకును మొసలము కాదే?
గోపికలులేని గొల్లని
గొల్చుట నిస్సారమైన సారముజువ్వే!

3. కావున గోపకులారా!
ఓపికతో గొల్వుడింక గోపకుమారుఁ।
రమణను రాధను యేలెటి।
రక్షకుడిల శిక్షకుండు శ్రీదక్షకునిన్ ॥

---

* Buddha went up to the Buddhi or intellect; but Brahman goes to the Soul—the root of the whole thing.

—‡§‡—

## ఆంధ్రైక్యత.

1. సర్కారాంధ్రులు ।
రాయలసీమా ।
తెలంగాణమూ ।
మూడూ కలసి ।
ఒకటేయంచును ।
ఢంకామీాదా ।
దెబ్బ కొట్టుచు ।
చాటర వెరువక । ఆంధ్రైక్యతను ॥

2. పృథ్విలోకెల్లను ।
అగ్రగణ్యులగు ।
త్యాగయగారూ ।
కృష్ణరాయలూ ।
కోడిరాముడు ।
అంధ్రరత్నమూ ।
అల్లూరాతడు ।
అంతా ఒకటే ।
ఆంధ్రులమంచును। ఎగిరి పాడరా ।
వెరవక నీవు । గెంతి ఆడరా ।
ఆంధ్రుడవై తే ॥ (20-11-1937)

—:0:—

## ఆంధ్రారాధన.

౧. గోపాలకృష్ణుండు "కొక్కి రాయా" యెనే ?
గాంధి శిష్యుడు నీకు 'గాడ్డు' యగునె?
అబ్దుల్ గఫ్ఫారు డాత్మ బంధువుడవో !
ఘనుడు నైజామ్ ప్రభువు వైరివాడె ?
అల్లూరి రామరాజు అన్యుడై పోయెనే ?
బాంబు బాబులు నీకు భ్రాతలైరె ?
కోడి రాముండయో ! ఉత్కళంబున మాగ్ర-
గామసుల్లుమనీకు అల్లుడటర !
ఆంధ్రకేసరి నేడు అరవకొనుల్లో జిక్క-
తమిళ రాజాజి మంత్రోజి యయ్యె ।
పట్టాభిరాముండు దిట్టకాడటవోరి ?
జాతి జన్వ్రాలు జాతకుండె !
కూర్మ వేంకటరెడ్డి కుత్సితుండటనీకు ?
బోగు దొరలంత మన ప్రోగువారె !
శాబాసు బోసుతో శంకరాచార్యులే ?
సుబ్బరాయలువట్టి యజ్ఞులైరె !

ఏల యీలాటి తర్కాలు చాలు ! జాలు !
ఎడమావుల విడనాడి నా యెండజేరు ।
మనుచు ధీరతతో బలుక నాత్మయక్షుడు ।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్య వర్యుడనఘు ॥ (26-6-33)

౨. ధనము కావలెనన్న మార్వాడి కొట్టుకో-
అరవ బ్యాంకీలకో పోవవలసె।
రాజ్యాంగ సాధనల్ బ్రిటిషు అరవలపాలు-
మిగులు గుజరాతీల ఖాసుసొత్తు।
తిండికి సాంబారు పగపు సాదము కూటు
పసలేని రసము పప్పడము మోరు।
బట్టలన్నియు మనకు అహమ్మదాబాద
బొంబాయి ఖాన్సారు సేయవలసె।
చదువులలో నుర్దూ, ఇంగిలీష్. యెంగిలీ
హిందీ భాసలు మనకు నబ్బుచుండె।
కళలకు కలకత్త, టాకీకి హాలివుడ్
సన్నెలుటాకికోమో, పాలునార్వే।
మతమునకు దయూలబాగు, శ్రీ పండరీ
క్షేత్రంబు హార్నాధపురము।
తుదకు సంధ్యలలో గూడ గంగ యమున *।
రెండు నదులె యింక మన పుణ్యనదులు।
కృష్ణ గోదావరీ పెన్న తుంగభద్ర।
ఆది నదులన్ని గట్టులో, మెట్టలోర!
ఎంతకాలమీ దుర్భర దాస్యదైన్య।
హీనస్థితి నిక నిప్పుడైన బాపుకొనగ।

* "నమో గంగా యమునయోర్మధ్యయే నసంతి తే మే
ప్రసన్నాత్మనశ్చిరంజీవితం వర్ధయంతి."

మీరలందరు నడుములు గట్టరయ్యా ।
ఆంధ్రదేశపు వీరులార! యువకులార ॥

3, ఆంధ్రరత్నము మ్రగ్గ గాంధిబందీలలో
తుదకు కాంగ్రెస్సిచ్చె బోసిచిప్ప ।
ఆంధ్రకేసరి నేడు అవ మంత్రాంగ బు
నడుమ నిర్వీర్యుడై నలిగిపోయె ।
పట్టాభి కాంగ్రెస్సు పట్టాభిషేక శుభ
సమయానికై వేచి వెళ్లబెట్టె ।
దేశభక్తుడు గాంధి దానాన దాసుడై
ఆంధ్రదేశముమాట మరచిపోయె ।
నాగలోకంబు జేరె - (శ్రీ) నాగయ్యుడు ।
తుదకు కాశేశ్వరున-కిట గాలువిరిగె ।
ఇకను - మిగిలినదీ రాష్ట్ర భారమంత ।
మీదయును, నాది, నామాట నిక్క-వంబు ।
లెండు! లేలెండు! లెండోహో! ఆంధ్రులార ॥

౪. పశ్చిమోత్తరమందు పగబట్టి యున్నట్టి
ఇప్పిసుల్తానదే! యిల్లువీడె ।
పాంచాళమందు సర్. హయ్యాత్తు ఖానహో!
కత్తి దూయుచునుండె శత్రుమీద ।
పినగాక మొన్నొన్న వంగదేశంబంత
మంత్రాంగ మహిమచే మారుమ్రోగె ।
నేడు యూ. పీ. లోన నైదులక్షల బంట్ల

కాల్బలంబుకు వంతు బయలుదేరె।
సి. పి. లో వేసె ఖరెగాను 'ఛీపు' ఔత్తు।
దేశ సంస్థానము లన్ని కలియజూచి।
సత్వరాంధ్రంబు సిద్ధికై సిద్ధపడుము।
లెమ్మ! లేలెమ్మ! లెమ్మొహా! ఆంధ్రవీర ॥
౫ వైదిక యజ్ఞముల్. తురకల గోవధల్,
అమ్మల జాతరల్, అంతమొందె।
ఆంధ్రరాజులు, రెడ్లు, కాపులు, కోమట్లు,
కమ్మని చౌదర్ల సామ్ముపోయె।
తెనుగుకు బందీలు – భోగాలతోపోరు–
విశ్వబ్రాహ్మలపేగు మాసిపోయె।
రాజమహారాజ రాజశ్రీ మార్తాండ
తేజ కరుణావీర ఆంధ్రభోజ।
అని బిరుదులపై గూడ వైరమబ్బె।
తుదకు యీశ్వరునకుగూడ–
ఆ! వంగనామమె!
పోయె నేటట యెనిమిది కోట్ల మనవి।
నడచె బ్రహ్మపురి ఉత్తరంబున ఉత్కళులకు।
అదిగో! పూరించె శంఖంబు చెన్నపురిలో।
వచ్చె కన్నడదండు బళ్ళారిదనుక!
ఇంకనైనను నిద్దుర వీడుమయ్య।
లెమ్మొ! లేలెమ్మ! లెమ్మొహా! ఆంధ్రవీర ॥
(24–9–1938)

## క్షాత్ర మార్గము.

౧. "పొలిటిక్సు"న లక్షవత్తుల వ్రతమును
తంతు వితంతు మార్గంబు కాదు ।
"పొలిటిక్సు"న మూడు వారంబులన్నంబు
వర్జించు నుపవాస దీక్ష కాదు ।
"పొలిటిక్సు"న అహింసేతి పరమోధర్మ
మని పల్కు శ్రీరంగ నీతి కాదు ।
"పొలిటిక్సు"న కోటి రూప్యంబు లార్జించి
నిర్మించు కార్యక్రమంబు కాదు ।
"పొలిటిక్సు"న 'కిల్లు–గెట్టింగు కిల్డు' *
దండమెల్లను బ్రహ్మ తేజోమయంబ ♦ ।
అనుచు ధీరతతో బల్కు నాత్మయశుఁడు ।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్య వర్యు డనఘు ॥

౨. రాష్ట్రముల్ త్రిప్పినన్ రాజ్యముల్ కదలునే
లాంకషైరుల కూడు కూలుగాక ।
ఉప్పు వండించినన్ నిప్పారిపోవునే
సంద్రమ్ము లింకిన నింకుగాక ।
తాళ్ళుకోసిన తల లూరక పోవునే
కల్లంగడులపన్ను క్రాలుగాక ।

* The Game of killing and getting killed.
♦ "బ్రహ్మ తేజోమయః దండః"—మనుస్మృతి.

శాసనోల్లంఘనమిచ్చునే స్వారాజ్య
మిరువదేడుల ఖైదు వచ్చుగాక ।
ఏల యీలాటి పిచ్చిపుల్లాయ పనులు ।
.............................................
అనుచు ధీరతతో బలుకు నాత్మయశుడు ।
అల్ల శ్రీ సుబ్రహ్మణ్యా వర్యు డనఘు ॥

(27-6-1933)



## అరాజకమార్గ ఖండన.

౧. ధనము కావలెనన్న లక్ష్మి గొల్వగరాద
దోపిడి మార్గముల్ యేల మనకు ?
రాజ్యమేలవలెన్న రాజబాటను బోయి
డేరడూనుల, ఢిల్లి జేరరాదె ? *
మతముద్ధరింపగా పూనిక గల్గుచో. గాంధి
హరిజనఘోష యేలమనకు ?
ముక్తి కావలెనన్న బ్రహ్మజ్ఞుడీయడే, భ్రాంతి
మార్గము లేలమనకు చెప్పుము ?
ముక్కుపచ్చలారని బాలుర జేగదీసి ।
గొంతుగోయించి మీ మెడల్ ఉరికిబోయు ।
నేల యెరుకతో వర్తింపు డిలను మీరు ।
ఆంధ్రదేశపు వీరులో! యువకులార ॥

౨. ధర్మంబు వలెనన్న గోపాలకృష్ణుని
బ్రాహ్మణ ధర్మంబు బూనరాదె ?
క్షాత్రంబు వలయుచో నల్లూరి వంశజు
క్షాత్రంబు బడసి తరింపరాదె ?
వైశ్యత్వముం జేర వలయు కోరిక యున్న ।
గాంధిశ్రేష్ఠుని రాట్న మేలరాదె ?
ముక్తిమార్గము జేగ సాధింపు మన్నచో
బ్రహ్మజ్ఞుడేలడే సరసలీల ?

* To Delhi and Dehradun

కాని ఇహాముకు పరముకు దూరమగుచు।
చాటుమాటుల దాగుచు వెనుకనుండి।
అప్రమత్తులౌ అన్యుల రూపుమాపు।
ధైర్య సాహస వీరత్వమేల మనకు ?

౩. వాలిని చాటుగా బాణంపు తూటుల
నేసిన రాముండు కూలలేదె ?
భీష్ముని మాయచే సంపశయ్యను బంప
ధర్మజుడేగడే ధర్మపురికి ?
దుర్యోధనుని తొడల్ విరుగగొట్టిన భీము
డెట్టి పరిఖ్యాతిని బడయగల్గె ?
వంగదేశమునుండి యుప్పదై దేల్లుగా
బాంబులేసెడివారు పరిభువులైరి ?
ధర్మమునువీడి మర్మము నసలెమరచి।
అజ్ఞులై, అంధకారంబు బాప భువికి।
ఆత్మఘాతుకమైనట్టి ఆడలాడు।
ఆంధ్రదేశపు యువకుల నేమనందు ?

౪. నరకాసురుండంచు నధకాక పూర్వమే
బాణసంచా కాల్చు బాబులహహా !
బంగారు కశిపులే యనిబల్కి యొకవంక
నారసింహము జూప నెరచువారు !
కాళీయఫణియని ఘాటుగా వాదించి
కొన్నిలు నాట్యంబు దిట్టనిడుచు।

# అరాజకమార్గ ఖండన.

౧. ధనము కావలెనన్న లక్ష్మి గొల్వగ రాద
దోపిడీ మార్గముల్ యేల మనకు ?
రాజ్యమేలవలెన్న రాజబాటను బోయి
డేరడూనుల, ఢిల్లి జేరరాదె ? *
మతముద్ధరింపగా పూనిక గల్గుచో, గాంధి
హరిజనఘోష యేలమనకు ?
ముక్తి కావలెనన్న బ్రహ్మణ్యుడీయడే, భ్రాంతి
మార్గము లేలమనకు చెపుము ?
ముక్కుపచ్చలారని బాలుర జేగదీసి ।
గొంతుగోయించి మీ మెడల్ ఉరికిబోయు ।
నేల యెరుకతో వర్తింపు డిలను మీరు ।
ఆంధ్రదేశపు వీరులో ! నాయకులార ॥

౨. ధర్మంబు నలెసన్న గోపాలకృష్ణుని
బ్రాహ్మణ ధర్మంబు బూనరాదె ?
క్షాత్రంబు వలయుచో నల్లూరి వంశజు
క్షాత్రంబు బడసి తిరింపరాదె ?
వైశ్యత్వముం జేర వలయు కోరికయున్న ।
గాంధి శ్రేష్ఠుని రాట్నమేలరాదె ?
ముక్తిమార్గము జేగి సాధింపుమన్నచో
బ్రహ్మణ్యు డేలడే చరసలీల ?

* To Delhi and Dehradun.

కాని ఇహముకు పరముకు దూరమగుచు ।
చాటుమాటుల దాగుచు వెనుకనుండి ।
అప్రమత్తులౌ అన్యుల రూపుమాపు ।
ధైర్య సాహస వీరత్వమేల మనకు ?

౩. వాలిని చాటుగా బాణంపు తూటుల
నేసిన రాముండు కూలలేదె ?
భీష్ముని మాయచే సంపశయ్యకు బంప
ధర్మజుడేగడే ధర్మపురికి ?
దుర్యోధనుని తొడల్ విరుగగొట్టిన భీము
డెట్టి ప్రఖ్యాతిని బడయగల్గె ?
వంగదేశమునుండి ముప్పదై దేళ్లుగా
బాంబులేసెడివారు ప్రభువులైరె ?
ధర్మమునువీడి మర్మము నసలెమరచి ।
అజ్ఞులై, అంధకారంబు బాప భువికి ।
ఆత్మ ఘాతుకమైనట్టి ఆడలాడు ।
ఆంధ్రదేశపు యువకుల నేమనందు ?

౪. నరకాసురుండంచు వధకాక పూర్వమే
బాణసంచా కాల్చు బాబులహహా !
బంగారు కశిపులే యనిబల్కి యొకవంక
నారసింహము జూప వెరచువారు ।
కాళీయ ఫణియని ఘాటుగా వాదించి
కౌన్సిలు నాట్యంబు దిట్టవిడుచు ।

బలిని మూడడుగులు అడిగి తెచ్చెదమంచు *
మదిని అహంకృతిన్ గొల్చువారు ।
రావణాసురుడంచు లంకకు బోకుండ
సీత యన్వేషణల్ సల్పువారు ।
భరత ధర్మంబని బుద్ధుడు, క్రీస్తు, టల్స్టాయీల
మతముల మసలువారు ।

కాంగ్రెసను పేర బూటక రాజకీయ !
నామధారక స్వారాజ్య వాదులహహ !
భరత దేశపు దాస్యంబు బాపువారె ?
ఆంధ్ర దేశపు వీరులో ! యువకులార ॥ (1935)

---

* పంజాబ్, ఖిలాఫత్, స్వరాజ్యములు.

—)(—

# స ము ద్ర గా న ము.

౧. "ఏమి పాడెదు సంద్రమా! యెపుడునీవు?
ఏమి పాడెదో గాని యెఱుక లేదు" ।
అనుచు కవులెందరెందరో బలుకవిందు ।
లోకమెల్లను దెలియంగ వింతయిచట ।
ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు?
నాకు సెప్పవె సంద్రమా! లీలనిపుడు ॥
౨. ఏమి పాడెదనయ్య, యో భూపవర్య ।
నీదు ప్రణవంపు నాదంబు నాల్గుదిశల ।
నిండియుండంగ సావిత్రి సరసజేరి ।
వేయిదళముల పద్మంబు నందుగూడి ।
బ్రహ్మదండెను వీణగా చేతబూని ।
పంచప్రాణంబులను నైదు తంత్రులంట ।
జీవయాత్రను లీలగా నడపుచుండ ।
వందలాదిగ మైళ్ళను ఆవరించి ।
వేలకొలదిగ అడుగులు లోతుగల్గి ।
శాంతిరసమును యెల్లెడ వెల్లువలుగ ।
విరియుజల్లుచు అంతరంగంబునందు ।
అగ్నిజ్వాలల నింపుగ నదుము కొనుచు ।
శబ్దమెచ్చట లేకుండ బిగియబట్టి ।
నిశ్చలతతోడ శ్రోత్రముల్ నిక్కబెట్టి ।
నీదు యోంకార నాదంబు యింపుగాను ।

వినుచునుండుదు యెల్లప్పుడం తెగాని ।
నాదు గానంబులేల ? యో బ్రహ్మవర్య !
అయిన సెప్పెద యడిగిన కలన నీకు ॥

౩. నాదు నాథుండు నాసెజ్జ వీడియుండ ।
విరహబాధల కోర్వంగ లేక యెపుడు ।
'రమ్ము ! రా ! రమ్ము ! రమ్మం'చు రమ్మనుచును ।
ప్రణయ గానంబు సేయుచునుందు నెపుడు ।
సార సాగర సార యో రసికసార ।
బ్రహ్మభావము దెల్పుమో బ్రహ్మవర్య ॥

౪. నీవు నాచెంగటకు వచ్చు యీదినమున ।
నీకు నర్ఘ్యంబు, పాద్యంబు పుష్పచయము ।
పరమ భక్తిని గీతముల్ పాటలెవ్వా ।
శక్తి యుక్తితో నర్పింతు నయ్య నీకు ।
వానిఁ గైకొని నన్ను మన్నింపుమయ్య ।
స్వాగతంబిదె నీకు యో బ్రహ్మవర్య ॥

౫. నాదు గర్భంబు నందున బుట్టినట్టి ।
పగడములు, ముత్యములు, మరి రత్నములును ।
వజ్ర వైడూర్య మాదిగా రాసులెన్నొ ।
నీకు కానుకగా దెచ్చి యిత్తునయ్య ।
వాని గైకొని యీభూమి రత్నగర్భ ।
జేనుకొమ్మంచు బాడుదు నొక్కసారి ॥

౬. ఇలను రారాజు లెందరో కలము* గట్టి ।
పెద్ద యోడలు, నౌకలు, సబ్‌మేరీన్లు ।
శాంతి సమరంబు లందున పెక్కుసార్లు ।
నాదు మేనున దాటుచు రాజ్యములను ।
వైభవము లెన్నొ, ఐశ్వర్యమెంతొ భువిని ।
అనుభవించుచు నుండంగ నీదు ప్రజలు ।
ఈ యుదాశీన భావంబు బూననేల ?
విడువు డికనైన మీారిద్ర నాల్గుదిశల ।
తోసి యిచ్చెద ! పొందు ! వేవేగ మీారు ।
అనుచు బాడుచు నుండుదు నొక్కసారి ॥
౭. పాశ్చాత్యఖండంబు వాసు లైరోపియన్లు ।
నేటికిప్పటి కేనూరు యేండ్లు పైగ ।
నౌకయానంబుచే నీదు రాజ్యమెల్ల ।
మెల్ల మెల్లగ కాజేసి నీదు ప్రజల ।
దాస్య శృంఖల బద్ధుల జేసివైచి ।
గాఢ నిర్వీర్య, నిస్తేజ, నీరసులుగ ।
జేయు, దేశంపు పరరాజ్య పీడనలను ।
వేగవేగమె పోద్రోలి నీదు మితము ।
రాజ్య మర్మంబులను యిల జాటుకొనుము !
ఆర్య సజ్జన మిత్ర యో భరతపుత్ర ।
అనుచు బాడుచు నుండుదు నొక్కసారి ॥

* కలము = పెద్దపడవ.

౮. భరతభూమికి యెల్లను తూర్పు సంద్ర ।
మగుచు నైదు రాష్ట్రంబు లను జేరు సరసినయ్యు!
నాదు నల్గురు భర్త లనామకు లనెడి ।
భానంబుదెల్ప బంగాళ ఘాత మనుచు ।
పరులు * పలుకంగ నయ్యయో ! ఆంధ్రులైన ।
వారి అనామకత్వంబు బాపుకొనరె ।
అనుచు విలపించు చుందును నొక్కసారి ॥

౯. నీదు సంధ్యలలో "నాల్గు సంద్రా" లనంగ ।
ఆర్టిక్కంటార్టిక్కట్లాంటికా పసిఫిక్కులనెడు ।
నీదు సూత్రంబు పఠియించి, వ్యాఖ్య జేసి ।
లోకములకెల్ల స్వస్తి గీతికలబాడి ।
శక్తికొలదిగ నీధర్మ సేవజేతు ।
వినుము ! నేసేయు గానంబు బ్రహ్మవర్య ॥

---

* తూర్పు ఇండియాకంపెనీవారు.

—:0:—

## ఆంధ్రదేశము - అరసికత్వము.

### ౧. ఆంధ్ర బ్రాహ్మణుడు :

జపతపస్సంధ్యాది జన్మకర్మలవీడి
జెండాను యుండగా జేరువాడు ।
ఆత్మయశుండైన ఆంధ్రరత్నము వీడి
ఒదులా బుద్ధుల గొల్చునెవడు ।
తాలిబొట్టునువీడి 'తళ్లి' ని చేబూని
తంతుకారక సంఘు మేలునెవడు ।
నవరసాన్నంబుల భోగించు నాత్మకు
మేక మేతలబెట్టు మేటిరొవడు ।
త్యాగమని శాస్త్రజ్ఞానంబు తగ త్యజించి ।
భోగమని పరరాజుల భోగ్యమగుచు ।
రంగమని మద్దిరంగని జేరువాడు ।
అహహా! ఆంధ్రదేశపు రసికులే? శాస్త్రిగారు ॥

### ౨. ఆంధ్ర సత్యాగ్రహి :

ఆంధ్రదేశముకెల్ల నధిపతి యావేళ
అన్యమతముల నధిష్ఠించువాడు ।
అగ్నిసాక్షిగగొన్న అంబుజాక్షికి * కామ
విధ్వంస వైధవ్య మిచ్చువాడు ।

* 'అన్న మేచ, కామేచ, ధర్మేచ' వివాహ మంత్రము.

ఆహారమందలి ఆచారమునువీడి
అన్నంబు వర్జించు మిన్న యెవడు ।
సత్యాగ్రహము పేర సరస మింతయు లేక
నాస్తిక్యము వహించు రసికుడెవడు ।
ఆంగ్ల భాషామనస్కుడై యజ్ఞుడగుచు ।
వెన్నముద్దల విడనాడు వెన్నుడెవడు ।
రామచంద్రుని డ్రోలెటి ఠక్కుసి యట !
అహహా ! హనుమంతరాయల రసికమేమొ ॥

3. ఆంధ్రక్షత్రియుడు :

పెద్దాపురాధీసు గద్దెను చేబూను
యద్దంపు చక్షుల దక్షుడెవడు ।
జగమున కెల్లను పతి నంచు సొగసుగా
మీసంబు దిప్పెడి మేటియెవడు ।
వర్మలలో కెల్ల వన్నెకెక్కిన వర్మ
నని రూఢిపాత్రంబు బల్కువాడు ।
క్షాత్రంబు యిలవీడి మాత్రలం గడులలో
రాత్ర్యహంబులు సల్పు రసికుడెవడు ।
నేటికొచ్చెను 'ఆంధ్రింపు రాష్ట్ర' గాదు ।
రాజ్యమును వీడి 'రైతుపత్రిక' కు నీడు ।
ఏటి రసికత్వ మీ ఆంధ్రభూమి యందు ।
అహహా ! వత్స జగ్పతి వర్మ యీ ఇలను నీకు ॥

౮. <u>ఆంధ్ర మహిళ</u> :

వీనుల కింపుగా వీణను చేబూని
  విన్నాణముగ బాడు వీరవనిత ।
సారస్వతినిబోలు సంగీత సాహిత్య
  సరసంపు మిన్న మా చిన్ని యంబ ।
సంపూర్ణ స్వాతంత్ర్య సమరంబు సల్పెడి
  వేళల స్వాతంత్రి సారసాక్షి ।
రాజధానీపుర రాజ్యమేలెడి నాడు
  రాణించు వాణి మా దుర్గరాణి ।

అట్టి దుర్గకు అబ్బెనే దుర్బలమగు ।
హిందీ, గాంధియు, బందీలు, సత్యాగ్రహంబు ।
గాక పట్టమహిషి కాకున్నె యిచట ।
మా కనకదుర్గకు నీడుగా జోడుగాను ॥

(7-8-1938)



## సుఖదుఃఖములు *

౧. సుఖదుఃఖములు రెండు - కావడికుండల్ ।
సుఖమెక్కువాయెనా - దుఃఖంబు సమయు ।
దుఃఖంబు మెండైన - సుఖమంతరించు ।
గాన యీరెండింటి - గతులను గనక ।
ఆత్మపై మలుసూపు - మాత్మీయరాయ ॥

౨. నిత్యంబు, భద్రంబు - నీరాజనంబు ।
నీకు తప్పక గల్గు - నీలవర్ణుండ ॥
నియమ బద్ధుడవీవు - యమనియమంబు ।
సాధక చిహ్నముల్ - సిద్ధుడవుకమ్మ ।
సుఖమున్న శాశ్వత - సుఖ దమ్మొకాని ।
బుద్బుదప్రాయముల్ - బ్యాంకి పేవర్లు ।
డబ్బు లేమికిగాని - దబ్బరకుగాని ।
జంకకో ! జంకకో ! జాతీయవర్య ॥

౩. కంటిపై పొరదీసి - కనుపాపగనుము ।
దారిద్ర్యమును బాసి - ధనవంతుడగుము ।
బూజు దులిపినయట్లు - లక్ష్మి నీకిచ్చు ।
నివురూదినంత నే - నిప్పుపై బడును ।
మబ్బు బాసిన భాను - డుదయించు పగిది ।
దీని యర్థము దెలిసి - దీనత వదలి ।
నిత్యంబు సుఖముండు - మో సుబ్బరాయ ॥

---

* శ్రీ శిరం వెంకటసుబ్బారావుగారికి చెప్పినవి.

## ఝాన్సీలక్ష్మి : అట్లతద్ది పాట.

౧. తక్కువేమి మనకూ ।
ఝాన్సీ - యొకతె యుంతువరకూ ॥
౨. శ్రేయుం బవళులు ।
రెండు చేతులను ।
సూర్య చంద్రులును ।
నక్షత్రంబులు ।
హస్త గతములై ।
వెలుగు చుండు - మన ।
ఝాన్సి యుండగను ।
తక్కువేమి మనకూ ॥ ఝాన్సీ ॥
3. కాళ్ళ వేళ్ళకును ।
చేతి గోళ్ళకును ।
పాదములకు - మరి ।
హస్తంబులపై ।
శక్తి రూపమగు ।
ఎర్రని రేఖలు ।
వెలసియుండు - మన ।
ఝాన్సి యుండగను ॥ తక్కువేమి ॥
౪. ఆకాశంబున ।
గరుడ విమానము ।
పై విహారింపుచు ।

కృష్ణ గూడుకొని ।
శంఖు చక్రములు ।
చేత బూని – మన ।
శత్రు కోటిపై ।
యుద్ధము జేసెడి ।
ఝాన్సిరాణి – మన ।
పాలిట నుండగ ॥ తక్కువేమి ॥

౫. ఆంధ్రావనిలో ।
కృష్ణ యొడ్డునను ।
విజయ వాడలో ।
కోట గట్టుకొని ।
దుర్గ గూడి యా ।
దుర్గం బందున ।
రాజ్యము నేలెడి ।
రాణి యుండగను ।
తక్కువేమి మనకూ ।
ఝాన్సీ – ఒకతె యుండువరకూ ॥

(1932 సెప్టెంబరు)

:0:

# శ్రీ సుబ్బరాజుగారు.

౧. వేదమతముల నెల్ల - దానధర్మములచే
 నుద్ధరించెడి కోటి - ప్రభుడెవండు ।
కోనసీమా ధ్యక్షుడను - కితాబ్ సిద్ధింప
 జ్యాంకి బోర్డుల నేలు - మేటి యెవడు ।
ఐశ్వర్యవంతుడై - అన్నాతురుల కెల్ల
 అండగా నిలచెడి - ఆంధ్రు డెవడు ।
సాధుస జ్జను లెల్ల - శరణు నీవని వేడ
 స్వారాజ్య సమరంబు - సల్పు నెవడు ।
ఉభయగోదావరీ మధ్య పల్లె నేలు * ।
సుబ్బరాయుల మిత్రుండు - సుబ్బరాజు ।
గలుగ మన కేటి కొదువ- యో - చిన్నియాంబ ।
విజయపుర రాణి, శ్రీవాణి, దుర్గ రాణి ॥

౨. ధర్మబద్ధుడు, ధనవంతు డామ్లపురపు ।
కాంగ్రెసే లెడి నిపుణుండు, రాజ్యయశుడు ।
ముక్తి కాంతను మరపించు సొగసు నగవు ।
నేడు రాణించ డేమొ యీ సుబ్బరాజు ?

3. రాజునకు వర్గ మేడ్గురు ♦ ।
యుండంగను వలయుగాదె స్వార్థమునన్ ।
మరచెనో ? విడచెనో ? ఈ కలి ।
కాలపు మహిమంబో? లేక మరియేకతనో ?

---

* నడిమి పల్లె. ♦ సప్తాంగములం (మను).

౪. మంత్రి దుర్బలుండు దుష్ప్వారివాడు।
పురము కోటకాదు కోడు కాని *।
జానపదంబెల్ల జార్జికి జెందదే!
రాజ్యమెట్లుసేయు రాజ్యయశుడు ?

౫, కోశమెల్ల కోట దాటిపోయెనుగాదె।
సైన్యమెల్ల కోసుటిండ్ల దూరె।
మిత్రులైన మేము మిగిలియుంటిమి యింక।
నమ్మి యేలరాదె? రాజవర్యా॥

౬. దైవంబు నిన్ను మెచ్చును।
దివిజులు, కిన్నరలు నీకు పుష్ప శతంబుల్।
ఇలపై భక్తితో నిత్తురు।
ఇటునటు జూడంగ నేల యీశ్వరు డుండన్ ?

౭. కావున దూకును రంగము।
నడుపుము రాజ్యాంగ తంత్ర వీరుడ వగుచున్।
ప్రానుము దండము పూన్కెతో।
చెండుము నీ శత్రుకోటి నుద్దండుడవై॥

౮ మా ఆశీస్సులు నీకును।
నిరతంబుగ గల్గుచుండు నిర్మల బుద్ధిన్।
భారము మాపై వేయుచు।
నిర్జింపుము నీదు వైరి వర్గనుబోలెన్॥

౯. కృష్ణాష్టమి నాడొచ్చెను।
కృష్ణుడు నీ యింటిదాక రాధాయుతుడై।

* కోడూరుపాడు.

రమ్మని పట్టెదో పాదము ।
పొమ్మని పోద్రోలి వెడలిపొమ్మనియెదవో ?
౧౧. రమ్మన్న రాజ్య మిత్తును ।
పొమ్మన్నను పోవు నీదు పొలములు పెక్కుల్ ।
ఇమ్మగ నేలును భక్తితో ।
నమ్మిన నమ్మకయునున్న నారాయణుడున్ ॥
౧౧ నరుడవు నీవయ కాదే ।
నారాయణు డిలను వెలయు బ్రహ్మణ్యండే ।
ఏటికి సంశయమింకను ।
నేడై నన్నుఁ జదువు గీత పారార్థములన్ ॥
౧౨. గీతా పారాయణమున ।
అబ్బును నీతియును రీతి నిబ్బర బుద్ధిన్ ।
తబ్బిబ్బు భ్రాంతి నడలును ।
సర్వము కృష్ణార్పణంబ యనుచును మదిలో ॥
౧౩. నరులకు యేలిక కృష్ణుడు ।
నారాయణుకైన రావు రాజ్య సుఖంబుల్ ।
నరులకు యత్నములేనిదె ।
నరనారాయణుల జేరు నన్ని యశంబుల్ ॥
౧౪. కావున విడువుము విషదము ।
పూనికతో నెక్కుపెట్టి గాండీవంబున్ ।
వేగమె యెక్కుము అరదము ।
సరసను సారథ్యమిత్తు స్వారాజ్యముకై ॥
(1935 కృష్ణాష్టమి)

## జగదీశ చంద్ర బోస్.

"క్రెస్కోగ్రాఫు" నుగట్టి తరులతా మర్మముల్
కంటికి పైద్రోలు ఘనుడెవండు ?
మార్కోని కంటె మున్ముంగ "వైర్లెస్సు" ను
మూర్కొన్న మార్కండ మూర్తి యెవరు ?
పదునేడు లక్షల రూప్యంబు లిచ్చి బోస్
శాస్త్రాలయము బ్రతిష్టించె నెవడు ?
జీవనిర్జీవైక్య సమితి సంధాన యో
జగదీశ చంద్ర నీ మేటియెవడు ?

అట్టి చిరజీవు - డటజూడు ! అస్తమించి ।
మరలుచున్నాడు తన స్వీయ మండలముకు * ।
ఓషధులబ్రోవ నిత్య మార్కండమూర్తి ◆ ।
అభినవాద్వైత బ్రహ్మ నిఖిలాంధ్ర వర్మ ॥

---

* చంద్రమండలము; జగదీశచంద్రుడు.

◆ మార్కొని = మార్కండేయులు.

## ట్రాట్స్కీ.

బియలిస్టోకు(1)న బుట్టి - రియలుస్కూలున(2) జదివి-
కారాగారము జేరి - గడపినావు ।
లండను(3) పురమందు - లెనిను(4). ప్లెఖనోలతో(5)
'ఇస్క్రా' జ్యోతి(6)ని - వెలిగించినావు ।
హంగేరి, టర్కీ, ప్యా - రిసు, స్పెయిను, విడనాడి-
'నవ్యసీమ'ల జేరి(7) - మసలినావు ।
మాతృదేశంబందు - జ్యోతి వెఱుగై యెగుర(8)-
లెనినుతో రాజ్యంబు - నేలినావు ।
వరుస పరదేశ యుద్ధంపు మంత్రివగుచు ।
పిదప రైల్వేల దిద్ది క్షోభంబు మాన్పి ।
తుదకు స్టాలిను (9) కుట్రలో త్రుళ్ళిపడియు ।
ఐరోపాయందు నిలువంగ నీడలేక ।
మెక్సికో జేరి, ఋషి జీవనంబు బూని ।
నేడు క్రూరంపు మృత్యువు వాతబడియు ।
'జయము ! నాల్గవ శ్రేణికి(10) జయ !' మటంచు ।
దివికి యేగితివో ! లియాన్ ట్రాట్స్కయ్యా ॥

(1) Bialystok; (2) Real Schule; (3) London; (4) Lenin; (5) Plekhanov; (6) 'Iskra' (Spark); (7) 'Novy Mir' (New World); (8) The Red Flag; (9) Stalin; (10) Fourth International. Iskra and 'Novy Mir' were two papers started by Trotsky.

## శ్రీనివాస అయ్యంగార్.

౧. 'హిందులా'* యంతయుం గరతలామలకంబు
గంగా ప్రవాహంబు గాంచినావు ।
పాము కుబుసము వీడుకైవడి బాసిన
సి. ఐ. యి.† కౌన్సిళ్ళు వదలినావు ।
వింధ్య దక్షిణ ప్రాంత వంధ్యత్వమును బాప
వీర కాంగ్రెసు వీర మలరినావు ।
దేశమెల్లెడ గాంధి బానిసత్వముబూన
దీక్షతో నాత్మ సేవించినావు ।
బ్రిటిషు, జప్టిను మహాలకందము బెరికి ।
శుభ్ర స్వారాజ్య సుందర భవనములను ।
గట్టినాడవు – యోగీర తమిళవర్య !
రమ్మ ! మాపురి కిదెనీకు స్వాగతంబు ॥

౨ శ్రీరంగ జనరంగ నాయకీ భోగ
లీలాలోలసుడ వీవు శ్రీనివాస ।
జౌత్తరాత్యులె మేటి 'బాపుజీ' లను భ్రాంతి
పారద్రోలిన దొడ్డ స్వామి వీవు ।
తెన్గు, నాయురు, తమిళ, ఆదిజాతుల "అయ్య"
లను లోన జేర్చిన గొప్ప అయ్య ।
ఆంధ్ర 'గార'ను బిరుదు గౌరవంబుగ నీదు ।
పేరునందున జేర్చు మాన్యవర్య ।

---

* Hindu Law. † C. I. E.

పంచభూతము లవి యైదు తమోమాయ ।
రాజ్యగుణములు గణములు రాజసములు ।
మనసు లోనను బిగియించి మెఱుగుమయ్య ।
ఆత్మ స్వారాజ్య జ్యోతిలో మసలుమయ్య ॥

3. శ్రీనివాసుడవె ?
శిరలచ్చి పాదపూజలు సేయు మూలంపు
బ్రహ్మమేను ।
ధనవంతుడవె ?
"ఆంధ్రులెల్లరు దొంగ"లని బలుక
సౌతిండియన్ బ్యాంకి నిట్టు ! కాలదన్నిన
ఆత్మయశుడ ।
దానశీలుడవె ?
ముల్లోకముల నొక్క తృటిలోన బ్రహ్మా
ర్పణంబని గ్రహియించువాడ ।
తిరుపతి మీదె ?
ఆంధ్ర అద్వైతసిద్ధి యీలోకమెల్ల
చాట నవతరించిన శుద్ధ బ్రహ్మవరుడ ।

ఇదుగో ! నీకిదె మా గోష్ఠి స్వాగతంబు ।
రమ్ము ! మా కనకదుర్గా పురంబునకును ।
పొమ్ము ! సేవలుచేసుక శుభము గల్గు ।
తెమ్ము ! సత్వర స్వారాజ్యసిద్ధి - జమ్ము ॥



నాటికి నేడ ? ఇప్పటికి తొమ్మిది దీర్ఘపు
యేండ్లుగడచె ।
ఎన్నాళ్ళకు తిరిగి వచ్చితివి ! గోపక
మిత్రమ ! ఔనుగాని ।
నీ తరుణము వచ్చెనా ? మాడేం డ్లింకను
విపినమార్గముల బూనవలాఁదె ?
ముహూర్తము వచ్చినవెన్క తగ్గుటయు
కర్జము కాదు ।
మరి కాలముపాటును వేగిరంపునుం దప్పె ।
శత్రుకోటియు బలిష్ఠులు ।
కేవల మాంగ్లు లొక్కరే కారు ।
ఇట యింటి దొంగలును పెక్కు కలారు ।
ధిక్ ! జాగ్రిత ! దద్దిరపాటువద్దు మిత్రమా !

(1-1-1939)

—:0:—

## మ డి పా ట.

౧. మడిమడి - యనెదవు - మనసా ।
నీకు - మడియేదొ - తెలియాదు ।
మతిలేని - మనసా ॥ మడిమడి ॥

౨. మాల మాదిగలను - మతాంతరులజేసి ।
మనకొంపకే - మాల - ముప్పునుదెచ్చెడి ॥మడి॥

3. వర్ణము - లవియేల - మనకు ।
రెండు - వర్ణములేగలవు - యిలకు ।
అందు - స్త్రీలు తెల్లనివారు ।
మగలు - నల్లనివారు ।
దీని - యర్థము ద్రోసి ।
నోరు - జేసుకపట్టి ।
మడిమడి - యనెదవు - మనసా ॥
నీకు - మడియేదొ - తెలియాదు ।
మతిలేని - మనసా ॥ మడి మడి ॥

## ఇల్లు.

౧ ఇంటగెలిచికాని – రచ్చగెలువగరాదు
ఇంట ముండనోపి – బయట శనము ।
ఇంట గెలువఁగోరి – యికనైన యెఱుకతో ।
ఇంద్రుడైన నీకు – శరణు జొచ్చు ॥

౨. ఇల్లేకద మనుజులకును ।
ఇల్లేకద రాజ్యములకు యిల్లే తల్లౌ ।
ఇల్లే పిల్లలభాగ్యము ।
ఇల్లే ముల్లోకములకు మూలమునువ్వే ॥

3. ఇల్లు వాకిలంద్రు-యిల్లాలు గృహిణిబో ।
ఇల్లులేనివాడ – వల్లకాడ ।
ఇల్లు–యిల్లు–యిల్లు – ఇదియెనా "విల్లు" సూ ।
చెల్లు నీశ్వరుండు – సాక్షిగాను ॥

౪. ఇల్లున్న యీశ్వరుండును ।
ఇల్లున్నను రాజ్య ధనము యశములు కలుగున్ ।
ఇల్లున్న తపము లబ్బును ।
ఇల్లే సూ సకలసౌఖ్య కారణమగుమీ ॥

౫. ఆత్మకు దేహంబిల్లగు ।
రాజ్యమునకు దుర్గసౌధ మిల్లగుగాదె ।
ఆలయ మిల్లగు దేవుని ।
గృహమే మానవునిసొత్తు మహిలో నువ్వే ॥

లు.

1. ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రము।
భారతజాతికిని తగును భారతరాజ్యమ్।
మానవకోటికి మహిలో,
శ్రీ సామ్రాజ్యంపులక్ష్మి యిల్లగు సువ్వే॥

2. ఈయింటితత్వ మెలుకతో।
చదివిన, మననంబు భక్తి శ్రద్ధతో విన్నా।
అబ్బును యిహామును, పరమును।
తప్పదు బ్రిహ్మణ్య పరము భక్తులకెల్లన్॥

(1938 జూన్)

—//—

## దండు పాట.

౧. ఢిల్లీ సుల్తాన్ ।
పట్టుక పోతాన్ ।
డేరా డూన్‌కి ।
డేకీ యెల్తామ్ ।
చెన్నాపట్టం కోట ।
చెండాడుకొస్తామ్ ।
బళ్ళారిలో టిప్పు ।
ఖిల్లా నిల్పిస్తామ్ ।
బ్రహ్మపురిలో మన -
ధర్మం స్థాపిస్తామ్ ।
హైదరాబాదా - రాజ్యంమనదే ।
హైదరాబాదా - రాజ్యంమనదే ॥ఢిల్లీ సుల్తాన్॥
౨. రామనగరులో - గుళ్లు కట్టిస్తామ్ ।
కనకదుర్గకూ - కానుకలిస్తామ్ ।
విజయవాడలో - కోటకట్టిస్తామ్ ।
బందరు రేవులో - ఓడలు కడతామ్ ।
మీరో - మేమో ।
చూడుడి - యెవరో ?
కాసుకోరా - కాశీశ్వరుడా ॥ఢిల్లీ సుల్తాన్॥

(1937 జనవరి)

—::—

## స్వరాజ్యలక్ష్మీ స్వయంవరము.

౧. గాంధిని మించిన - "గాడ్సు" యెవడే ।
అమ్మా ! ఓ కొమ్మా ॥ గాంధిని మించిన ॥

౨. కొండంతవాడని - 'కొండ' ను బిలువగ ।
'గుండుసున్న'(1) అయె - నమ్మా ! ఓ కొమ్మా
॥ గాంధిని ॥

3. వల్లభుడౌనని - 'వల్లభు' జేరగ । (2)
'వందేమాతర'- మన్నసే ॥ ఓకొమ్మా ॥గాంధిని॥

౪. శౌర్యవంతుడని - షౌకతల్లి జూడ ।
సవతిపోరులే (3) యమ్మా ! ఓకొమ్మా ॥గాంధిని॥

౫. మానవంతుడని - మాలవ్య(4) జేరగ ।
మాలగోలయా(5) - నమ్మా ॥ ఓకొమ్మా ॥గాం॥

౬. జాతీయుండని - జవహరు జేరగ ।
జారత్వము మొందే(6) - తప్పాతో ॥ గాంధిని ॥

౭. దాసవరుండని - బోసును బిలువగ ।
బోసివాడె యో - కొమ్మా ॥ గాంధిని మించిన ॥

౮. భాగ్యవంతుడని - బజాజు(7) గొలువగ ।
బానిసత్వమే - యమ్మా ! ఓకొమ్మా ॥గాంధిని॥

(1) "From Hero to Zero", (2) వల్లభాయిపటేల్.
(3) Islamic damsels and American women.
(4) మాలవ్యాజీ. (5) Poona Harijan pact.
(6) భావ జారత్వము. (Intellectual concubinage with Russia). (7) జమ్నాలాల్ బజాజ్.

౯. రామసగరున - రాజ్యము నేలిన ।
ఇల గోపకునకు - యీడగువాడే ।
జయ విజయపురి - నేలెటివాడే ।
బ్రహ్మణ్యుండగు - సుబ్రహ్మణ్యుడే ।
మనుజాధినాథుడె - మంత్రియుండె ।
గాంధినిమించిన - "గార్డు" యితడే ।
నమాస్తే - ఓకొమ్మా ॥ గాంధిని మించిన॥

—:0:—

## “ శ్రీ ము ఖ ము ”

౧. శ్రీముఖ – సంవత్సర ।
పుష్యమి – బహుళమందు ।
అమవస – తిధినాడు ।
షడ్గ్రహ – కూటమిలో ।
ఈభువి – కంపమొందె । *
దీని యు – ర్ధము నేడు ।
వినరె స – జ్జనులారా ॥ శ్రీముఖ॥

౨. ఇలను – రకరకసు తెల్ల ।
క్రూర హిం – సాలతోడ ।
వెల్లు – విరచీ సాధు ।
సజ్జను – లను బాధ ।
పెట్టుచుండగ ।
చుట్టు ముట్టుచు ।
జెట్టి వీరుడు ।
బ్రహ్మచర్యుడు ।
సిద్ధివిడిచి యా ।
భద్రశాలితో ।
ఉద్ధరింపగ । బయల్వెడలెను ॥
దీని యర్థము – గనరె ॥ సజ్జనులారా ॥ శ్రీముఖ॥

(15–1–1934)

* బీహారు భూకంపము.

## జై ! జగన్నాథ్ !

న గాంధీ ।
న గార్నర్ ।
న కాంగ్రెస్ ।
న గార్నమెంట్ ।
నచేరాట్ణ తత్త్వాది –
“నోఛేంజి” హాత్వ్యమ్ ।
అహమ్ బ్రహ్మాసిద్ధిమ్ ।
మమే కం శరణ్యామ్ !
చతుస్సాగ రాంతమ్ ।
బోలో ! జగన్నాథమూర్తే ॥

(4-1-1938)

ఓమ్ స్వస్తిః

